# "ఆటలో ఆటగా నవ్వులో నవ్వుగా, సరిగ్గా చూసీ, ఆలోచించీ, టక్కున అంటించాలీ యింక, సరదాగా యిది చెయ్యాలింక" — ఫెవీ ఫెయిరీ





"ఇంద్రజాలం కావే కాదిది
చేత్తోచేసే తమాషా యిది
దబ్బాతోనూ పనియే లేదు
దీనికి యిక మరి తిరుగేలేదు."
"ఏమిటిదంతా యిటొచ్చి చెప్పు
ఏంచెయ్యాలో చప్పున చెప్పు."
"రండర్రా యిటు రండర్రా
చెప్పేదేదో వినిపొండర్రా
ఆలోచించి అంటించింక
ఫెవికాల్ ఎమ్ ఆర్ తేవాలింక
ఏ బొమ్మయినా, ఏ బుట్టయినా
ఏ పర్సయినా చేసెయ్యొచ్చు
పట్టుకోకనే పట్టుకునేదిది
మరికి కానిది ముచ్చటైనది
సరదా సరదా తమాషాయిక
బొమ్మేదైనా, చేసెయ్యింక"

జంబో ద జంబోను తయారు చేసే క్రమపద్ధతిని ఉచితంగా
పొందటం కోసం యీ కూపన్‌ను
పంపించండి లేదా యీ చిరునామాకు వ్రాయండి:
"ఫెవీ ఫెయిరీ" పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020.
జంబో ద జంబో మీ గదిలో చిత్తు కాగితాలన్నిటినీ
నిలవ చేసి మీ గదిని శుభ్రంగా ఉంచుతుంది.

జంబో ద జంబోను తయారు చేసే క్రమపద్ధతిని ఉచితంగా
పొందటం కోసం యీ కూపన్‌ను
పంపించండి లేదా యీ చిరునామాకు వ్రాయండి:
"ఫెవీ ఫెయిరీ" పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020



పేరు ______________________

వయసు ______________________

చిరునామా ______________________

నగరం ______________________

రాష్ట్రం ____________ పిన్ ____________

మీకు మా క్లబ్ 'ఫెవీ క్రాఫ్ట్' అందిందా? అవును/కాదు (Ch)

ఫెవికాల్ ఎమ్ ఆర్
సింథెటిక్ ఎడ్హెసివ్




## బాగా పనిచేసేది, మరెంతో పేరున్నది
## ఫెవికాల్ ఎమ్ ఆర్ అంటేనే అది

# NP

# Dubbleyum

## PRESENTS

**A NEW WORLD OF LOVE & ADVENTURE FUN & FROLIC!**

**Look for the LUCKY COUPON in NP Dubbleyum Packet**




COLLECT

One latest comic book for 12 lucky coupons
or
The latest edition of Enid Blyton or Mills & Boon novel for 30 lucky coupons




**DOUBLE COLOURS**
**DOUBLE FLAVOURS**
**DOUBLE SIZE AND**
**BIGGER BUBBLES**

NP Dubble yum
SOFT & JUICY BUBBLE GUM




**The National Products**
BANGALORE-32

**NOTHING CAN BEAT A NP BURST OF FROLIC**

# మీ అభిరుచికి సరికొత్త రుచి!

బాన్ బాన్ లు న్యూట్రిన్ వారినుండి!




శ్రేష్ఠమైన / సరికొత్త బాన్ బాన్‌లు న్యూట్రిన్ వారినుండి!

మిల్క్ క్రీం
లెమన్ కోకనట్
ఫ్రూటి • చాకోమింట్




nutrine

BON BON



nutrine భారత దేశంలో అత్యధికంగా అమ్మబడే మిఠాయిలు

న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రై. లిమిటెడ్, చిత్తూరు-517 002 (ఆంధ్రప్రదేశ్)

CLARION/NC/8571

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి


ఈ నెల బేతాళకథ [''నిదర్శనం'']కు ఆధారం, జొన్నలగడ్డ రామలక్ష్మి రచన. కేవలం తమ స్వార్థమే పరమార్థంగా భావించే వ్యక్తుల్లో, విచక్షణాజ్ఞానానికీ, వివేకానికీ తావుండదు. అలాంటివాళ్లు, తమ చర్యల వల్ల రానున్న దుష్ఫలితాలను గురించి ఏమాత్రం తర్కించరు. ఈ నీతి, ''అమ్మవారి నగలు'' అన్న కథలో చక్కగా నిరూపించబడింది.

## అమరవాణి

ద్రవ్యం లబ్ధం ద్యూతేనైవ, దారా మిత్రం ద్యూతేనైవ,
దత్తం భుక్తం ద్యూతేనైవ, సర్వం నష్టం ద్యూతేనైవ.

[జూదంవల్ల డబ్బు గడించవచ్చును. దానివల్ల, భార్య, మిత్రులు లభిస్తారు. ఒకరికి యివ్వడం, అనుభవించడం కూడా సాధ్యపడుతుంది. కాని, సర్వనాశనం కూడా జూదంవల్లనే కలుగుతుంది.]


సంపుటి 78 జనవరి '86 సంచిక 1

విడి ప్రతి : 2-50 :: సంవత్సర చందా : 30-00







# మిఠాయిల మహారాజు
# పాలతో వినోదం కల్పించాడు




Parry's

# కారమిల్క్



శ్రేష్ఠమైన మీగడపాలు, మరియు బంగారపు రంగు కేరమిల్, ప్యారీస్ ఈ నోరూరించే, మెత్తని పాల మిఠాయిలలో, వాటిని కావలసిన రీతిలో చేర్చింది.

నోరూరించే రకరకాల ప్యారీస్ మిఠాయిలు:

కారమిల్క్ • ట్రి-మా • చాకొలెట్ ఎక్లెయిర్స్
కోకొనట్ పంచ్
చాక్లెయిర్స్ • కోకొనట్ క్రీమ్
లాల్లీపాప్స్ • గోల్డెన్ బాన్ బాన్




70 సంవత్సరాలకుపైగా
మిఠాయిలలో
మొట్టమొదటి పేరు

PCL 1828

## చందమామ కబుర్లు



### కనుగొనబడిన పెద్ద ఓడ!

1912వ సంవత్సరం, ఏప్రిల్ 15న, ఆనాటి పెద్ద ఓడ అయినటువంటి 'టిటానిక్' సముద్ర జలాలలో మునిగిపోయింది. ఆ ఓడలోని 2,224 మంది ప్రయాణీకులలో 1513 మంది సముద్రం పాలయ్యారు. ఆ మునిగిపోయిన ఓడ, ఉత్తర అట్లాంటిక్ సముద్రంలో రెండున్నర మైళ్ళ లోతున ఉన్నట్టు, ఇటీవల అమెరికాకు చెందిన ఒక నౌకా పరిశోధనా సంస్థ కనుగొన్నది।

### 'సమంత' వజ్రం!

అమెరికాకు చెందిన సమంతా అనే విద్యార్థిని, ప్రపంచ శాంతికి కృషి చేయమని రష్యా నాయకులకు ఒక ఉత్తరం రాసింది. ఆ చిన్నారి మనోభావానికి ముగ్ధులైన ఆ నాయకులు ఆమెను 1983వ సంవత్సరం సోవియట్ రష్యాకు ఆహ్వానించారు కూడా. 1985వ సంవత్సరం జరిగిన ఒక విమాన ప్రమాదంలో సమంత దుర్మరణం చెందింది. ఆ అమ్మాయి స్మృతి చిహ్నంగా సైబీరియా గనుల్లో లభించే ఒక పెద్ద వజ్రానికి 'సమంత వజ్రం' అని పేరు పెట్టారు।





### నడిచే పర్వతం!

పాకిస్థాన్‌కు చెందిన అలన్‌చన్నా అనే 'పెద్దమనిషి' ఇటీవల న్యూయార్క్ నగర వీధుల్లో నడిచిపోతూ, రాకపోకలను కొంతసేపు స్తంభింపజేశారు. ఎనిమిది అడుగులా, మూడు అంగుళాల ఎత్తు ఉన్న చన్నా అక్కడి మనుష్యుల మధ్య ఒక కొండలా కనిపించారు. అతన్ని చూడగానే అందరూ ఆశ్చర్యంతో ఆయన చుట్టూ గుమిగూడారు. ఈ వింత సంఘటనను టీవీలు చిత్రంగా తీశాయి।

## మీకు తెలుసా?

1. హిందూ మహాసముద్రంలోని ద్వీపాలలో కెల్లా పెద్దది ఏదో మీకు తెలుసా?
2. మధ్యధరా సముద్రంలో ఉన్న పెద్ద ద్వీపం ఏది?
3. 1961వ సంవత్సరం అగ్నిపర్వతం ప్రేలడంతో ఖాళీ చేయబడిన దక్షిణ అట్లాంటిక్ సముద్రంలోని ద్వీపం ఏదో మీకు తెలుసా?
4. ఫిజీదీవు లనబడేవి ఎన్నో మీకు తెలుసా?
5. ఫిలిప్పైన్స్ రిపబ్లిక్‌లో ఎన్ని ద్వీపాలున్నాయో మీకు తెలుసా?

(సమాధానాలు 65వ పేజీలో)

పురాణగాథలు :

# అంబ

కాశీరాజ్యాన్ని పరిపాలించిన హోత్రవాహనుడికి అంబ, అంబిక, అంబాలిక అనే ముగ్గురు కుమార్తెలు ఉండేవారు. వారికి యుక్తవయసు రాగానే, రాజు స్వయంవరం ప్రకటించాడు.

భీష్ముడు, తన తమ్ముడయిన విచిత్రవీర్యుడికి వివాహం చేయడానికి, స్వయంవరానికి వచ్చిన రాజకుమారులందరినీ ఓడించి, రాకుమార్తెలు ముగ్గురునీ బలవంతంగా హస్తినాపురానికి తీసుకుపోయాడు.

అంబ తాను అంతకు పూర్వమే సాళ్వుణ్ణి వరించినట్టు చెప్పగానే, భీష్ముడు ఆమెను అలాగే వెళ్ళమని సాళ్వుడి వద్దకు పంపాడు. అయినా, ఒకసారి భీష్ముడు బలవంతంగా అపహరించుకుని పోయిన అంబను పెళ్ళాడడానికి సాళ్వుడు నిరాకరించాడు !

అంబ విచారంతో భీష్ముని వద్దకు తిరిగివచ్చి, విషయం తెలియజేసి, తన్ను వివాహమాడమన్నది. అందుకు అతడు సమ్మతించలేదు. ఆఖరికి అతని గురువైన పరశురాముడు ఆజ్ఞాపించినా భీష్ముడు వివాహమాడనన్న తన ప్రతిజ్ఞకు భంగం కలిగించలేనన్నాడు !

తన వివాహాన్ని చెడగొట్టిన భీష్ముడి మీద పగ తీర్చుకోవాలని అంబ శివుణ్ణి గురించి ఘోరమైన తపస్సు చేసింది. మరు జన్మలో ఆమె కోరిక నెరవేరే విధంగా శివుడు వరమిచ్చాడు.

ఆ వరప్రభావంతో అంబ ద్రుపదరాజపుత్రిగా జన్మించి, బాల్యం నుంచే రాజోచిత విద్యలు నేర్చింది. భారతయుద్ధానికి ముందు యక్షుని ప్రార్థించి, పురుషలక్షణాలను సంపాదించి శిఖండి అయింది.

కురుక్షేత్రంలో జరిగిన భారతయుద్ధంలో, అర్జునుడు భీష్ముణ్ణి ఎదుర్కొన్నప్పుడు, అర్జునుడి రథం మీద శిఖండి ఉండడం చూసి, భీష్ముడు ఒక స్త్రీ మీద అస్త్రప్రయోగం చేయడమా ? అని అస్త్రసన్యాసం చేశాడు. అదే అదనుగా తీసుకుని అర్జునుడు భీష్ముణ్ణి పడగొట్టాడు. ఆ విధంగా అంబ పంతం నెరవేరింది !





# చిక్కుముడి

దాదాపు రెండు సంవత్సరాలకాలం, కుదరని వ్యాధితో బాధపడి తండ్రి మరణించగానే, గిరిబాబు లోకంలో ఒంటరివాడైపోయాడు. అతడు వున్న కొద్దిపాటి పొలాన్ని అమ్మి, తండ్రి చికిత్సకోసం చేసిన అప్పులు తీర్చివేసి, పట్నం వెళ్ళి ఏదైనా ఉద్యోగం సంపాయించుకోవాలని బయలుదేరాడు.

దారిలో గిరిబాబు ఒక చిన్న గ్రామం దాటి కొంత దూరం వెళ్ళగానే, బాట పక్కన ఒక చెట్టు నీడలో కూర్చుని వున్న ముసలివాడొకడు కనిపించి, అతడితో, "పట్నం వెళుతున్నావా, బాబూ? నేనూ అక్కడికే వెళుతున్నాను. బాడుగబండి కోసం యిక్కడ ఆగాను. నువ్వూ, నాతో పాటు తోడుగా వస్తే కాస్త ధీమాగా వుంటుంది. నేను గుండెజబ్బు మనిషిని!" అన్నాడు.

అప్పటికే చాలా దూరం నడిచి వుండడంతో, గిరిబాబుకు చాలా అలసటగా వున్నది. బాడుగబండి అనగానే అతడికి కొంత ఉత్సాహం కలిగింది.

అతడు ఏదో అనబోయేంతలో, ముసలివాడు, "మరోలా అనుకోకు, బాబూ. బాడుగబండికయ్యే ఖర్చు నాదే. ఈ మధ్య గుండెజబ్బుతోపాటు, యితరత్రా గొడవల వల్ల, నాలో పిరికితనం పాలు పెరుగుతున్నది. అందుకే నిన్ను కాస్త సాయంగా వెంట రమ్మంటున్నాను," అన్నాడు.

"ఇంత చెప్పాలా, తాతా! ఇద్దరం కలిసే వెళదాం," అన్నాడు గిరిబాబు.

కొంతసేపటికి అటుగా ఒక బాడుగ బండి వచ్చింది. ముసలివాడు, బండివాడితో బాడుగ సంగతి మాట్లాడి, గిరిబాబుతో, "ఏమీ అనుకోక, యీ పక్కన వున్న పెట్టెను కాస్త బండిలో పెట్టు,

మాచిరాజు కామేశ్వరరావు



బాబూ. బరువులు ఎత్తవద్దని వైద్యులు చెప్పారు,'' అన్నాడు.

ఆ సమయంలో బండివాడు, కొంచెం దూరంలో కనిపించిన పచ్చిగడ్డి కోసి, తన ఎద్దుకు వేసేందుకు వెళ్ళాడు.

వాడు తిరిగిరాగానే గిరిబాబు పెట్టెను బండిలో పెట్టి, ముసలివాడికి చేయి ఆసరా యిచ్చి బండిలో ఎక్కించాడు. బండి పట్నం పొలిమేరలు సమీపించేసరికి, సూర్యాస్తమయవేళ కావస్తున్నది.

బండి పట్నం ప్రధానవీధిలోకి రాగానే, ఇద్దరు రక్షకభటులు బండిని ఆపి, "ఎక్కడి నుంచి వస్తున్నారు? మీ వెంట వున్న సామాను సోదాచేయాలి,'' అన్నారు.

ఆ మాటలు వింటూనే ముసలివాడు వెలవెలపోతూ, ''అయ్యా, నేను గుండె జబ్బు మనిషిని. వైద్యం కోసం పట్నం వచ్చాను. నన్ను త్వరగా వెళ్లనియ్యండి,'' అన్నాడు.

''మీ సామాను పరీక్షించడం పూర్తవగానే, మీరు హాయిగా వెళ్ళొచ్చు," అంటూ రక్షకభటులు బండీలోంచి పెట్టెను కిందికి దించి, దానికి తాళం వేసివుండడం చూసి, తాళపుచెవి యివ్వమని అతణ్ణి అడిగారు.

ముసలివాడు వెంటనే, ''ఈ పెట్టె నాదికాదు, బాబూ. ఈ కుర్రాడిది,'' అని, ఆ జవాబుకు ఆశ్చర్యపోయి చూస్తున్న గిరిబాబును కోపంగా, ''అలా గుడ్లు మిటకరించి చూస్తావేం? తాళపుచెవి అడుగుతున్నారు, యివ్వు,'' అన్నాడు.

''తాళపుచెవి, నా దగ్గిర వుండడం ఏమిటి?'' అన్నాడు గిరిబాబు మరింతగా ఆశ్చర్యపోతూ.

''నీ పెట్టెతాళం, నీదగ్గిర కాక మరెక్కడుంటుంది?'' అన్నాడు ముసలివాడు చిరాగ్గా.

అంతలో బండివాడు, ''ఆ తాళపుచెవేదో వారికి త్వరగా యివ్వండి. నేను మిమ్మల్ని యిక్కడ దించి, తిరిగి వెళ్ళిపోవాలి,'' అన్నాడు గిరిబాబుతో.



పెట్టెను గిరిబాబు బండిలో పెట్టడం చూసిన బండివాడు, ఆ పెట్టె అతడిదే అనుకున్నాడు.

గిరిబాబు ఏమి చేయాలో తోచక దిగాలు పడిపోయాడు. రక్షకభటులు విసుక్కుంటూ పెట్టెతాళం బద్దలుకొట్టారు. పెట్టెలో చాలా పాత బట్టలున్నవి. వాళ్ళు వాటిని తొలగించి చూడగా, అడుగున ఒక మూట కనిపించింది. వాళ్ళు ఆ మూట విప్పారు. అందులో చాలా బంగారునగలు కనిపించినై.

రక్షకభటులిద్దరూ, గిరిబాబు మెడ పట్టుకుని, "ఓరీ, ఆరితేరినదొంగా! పాత బట్టల అడుగున దాస్తే మాత్రం, దొంగ సొత్తు దాగుతుందా? పోలవరం జమీందారుగారింటిని దోచిన ఘనుడివి, నువ్వే నన్నమాట" అన్నారు.

గిరిబాబు వడవడ వణికిపోతూ "అయ్యా, నేను దొంగనుకాను. ఈ పెట్టె నాది కాదు, ఈ ముసలాయనిది. నా మాట నమ్మండి!" అన్నాడు.

ముసలివాడు రౌద్రంగా, "ఎవడివిరా నువ్వు! నా మీద దొంగతనం మోపుతావా? నా వయసు చూసయినా మర్యాదగా మాట్లాడడం నేర్చుకో," అన్నాడు.

ఇదంతా చూసి రక్షకభటులు, ఆ ముగ్గురితో, "మీలో ఎవరు నిజం చెబుతున్నారో, ఎవరు అబద్ధం చెబుతున్నారో తెలియడం లేదు. అందరూ ముందు కొత్వాలు దగ్గిరకు రండి," అని వాళ్ళను కొత్వాలు దగ్గిరకు తీసుకుపోయారు.

కొత్వాలు బండివాణ్ణి బాగా ఎరుగు. అందువల్ల ఆయన వాణ్ణి వెళ్ళి పొమ్మన్నాడు. తరవాత ముసలివాణ్ణీ, గిరిబాబునూ ప్రశ్నించగా, వాళ్ళు పూర్వంలాగే పెట్టె మాది కాదంటే, మాది కాదని జవాబివ్వసాగారు.

ఆయన వాళ్ళిద్దర్నీ కచేరీగదుల్లోనే వుంచమని రక్షకభటులకు చెప్పి, ముసలాడూ, గిరిబాబులతో, "మీలో ఒకడు ఆరితేరిన గజదొంగ. రేపు ఉదయానే



కొత్వాలు మర్నాడు కచేరీకి వెళుతూనే, గిరిబాబును పిలిపించి, ''మావాళ్ళు పొరపాటుపడి నిన్ను పట్టుకువచ్చారు. జమీందారుగారి ఇల్లు దోచిన దొంగ, పట్టుబడినట్టు సమాచారం అందింది. నువ్వు వెళ్ళవచ్చు!'' అని ముసలివాడి పెట్టెను గిరిబాబు చేతికి యివ్వబోయాడు.

పెట్టెను చూస్తూనే గిరిబాబు భయపడిపోతూ, ''అయ్యా, యిది నాది కాదు. ఆ ముసలాయనదని మనవి చేసుకున్నాను. దీన్ని నాకిస్తారెందుకు?'' అన్నాడు.

''బాడుగ బండివాడి సాక్ష్యం ప్రకారం కూడా, యిది నీదే! ఎవళ్ళ సొత్తు వాళ్ళకు అందజేయడం, మా విధి. యిక వెళ్ళు,'' అన్నాడు కొత్వాలు కరుకుగా.

ముందు అక్కడి నుంచి బయటపడి, తరవాత ముసలివాడికి పెట్టెను యివ్వవచ్చుననుకుంటూ, గిరిబాబు పెట్టెతో సహా అక్కడి నుంచి బయలుదేరాడు.

గిరిబాబు అటు పోగానే, కొత్వాలు ముసలివాణ్ణి పిలిపించి, ''నిర్దోషులైన మిమ్మల్ని అనవసరంగా అనుమానించాం. మీరూ, ఆ కుర్రవాడూ దొంగలు కాదని తెలిసింది. ఆ పెట్టెను కుర్రవాడి కిచ్చి పంపేశాను. మీరూ వెళ్లవచ్చు,'' అన్నాడు.

పెట్టె తీసుకుని గిరిబాబు వెళ్ళిపోయాడని విని, ముసలివాడు నిరాశపడిపోయి, ఆ సంగతి తేల్చుతాను,'' అని ఇంటికి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి కొత్వాలు భోజనం చేస్తూ, ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూండడం గమనించిన అతడి భార్య సంగతేమని అడిగింది.

కొత్వాలు జరిగింది చెప్పి, ''ఇంతకాలంగా ఉద్యోగం చేస్తున్నాను, ఏనాడూ నేరపరిశోధనలో యింత చిక్కుముడి ఎదురవలేదు,'' అన్నాడు.

కొత్వాలు భార్య కొంచెం సేపు ఆలోచించి, ''ఇది ఏదో చిక్కుముడి అన్న భ్రమతో పెద్దగా ఆలోచిస్తూ చిక్కులో పడ్డారు. ఇలా చెయ్యండి!'' అని, ఆ చేయవలసినదేమిటో భర్తకు చెప్పింది.

ఎలా అయినా వాణ్ణి పట్టుకోవాలనుకుంటూ బయలుదేరాడు.

అతడికి వీధి మలుపు తిరగగానే, ఒక ఇంటి అరుగు మీద పెట్టెతో సహా కూర్చుని వున్న గిరిబాబు కనిపించాడు. ముసలివాడు చప్పునపోయి, పెట్టెను తీసుకుని, "ఒరే, కుర్రవెధవా! పదివేల ఖరీదు చేసే నగలు తేరగా దొరికాయి, పట్టుకు పోదాం అనుకున్నావా?" అన్నాడు.

గిరిబాబు ఏమీ తొణక్కుండా, "నీ పెట్టె, నీకు యిచ్చిపోదామనే ఇక్కడ కూర్చున్నాను. కొత్వాలు ఇందులో వున్నది దొంగసొత్తు కాదన్నాడు. అయినా, యీ పెట్టె నాదని రక్షకభటులకూ, ఆయనకూ ఎందుకు చెప్పావో అర్థం కావడం లేదు. ఇక ఎవరిదారి వారిది. ముందు నేనెక్కడైనా చిన్న ఉద్యోగం సంపాయించుకోవాలి," అంటూ అరుగు మీది నుంచి కిందికి దిగాడు.

అంతలో వెనక నుంచి వస్తున్న కొత్వాలు, ముసలివాడిని, "గుండెజబ్బు తాతగారూ, కాస్త ఆగండి! ఆ పెట్టెలో నగలు లేవు; వున్నవి పాతబట్టలు!" అని కేకవేసి ఆపి, అతణ్ణి కొంచెం వెనకగా వస్తున్న రక్షకభటులకు చూపుతూ, "ఈ ముసలాడు గజదొంగ. పెట్టెలో దొరికినవి, వీడు జమీందారుగారింట తస్కరించిన నగలే. వీణ్ణి ముందు ఖైదులో పెట్టండి," అని ఆజ్ఞాపించాడు.

ఇది విని గిరిబాబు నిర్ఘాంతపోయి, "అసలు దొంగ దొరికాడన్న మాట! నేను నిర్దోషినని యిప్పటికి తమకు పూర్తి నమ్మకం కలిగినందుకు సంతోషంగా వున్నది," అన్నాడు.

కొత్వాలు అతడి ముందుకు వచ్చి, భుజం తట్టి, "నీ నిర్దోషిత్వమే కాదు; నీ నిజాయితీ కూడా రుజువయింది. మా కచేరీలో ఉద్యోగం యిస్తాను, ఇష్టమేనా?" అని అడిగాడు.

"అంతకన్న కావలసిందేమున్నది! తమ దయకు చాలా కృతజ్ఞుణ్ణి," అన్నాడు గిరిబాబు ఆనందంగా.





# పిల్లులతో పరీక్ష

శ్రీపురాన్నేలే విద్యాధరు డనే రాజుకు, సుదర్శనుడు మంత్రి. శ్రీపురం చాలా చిన్న రాజ్యం. దాని పొరుగున సైనిక బలంలో పెద్దవైన కొన్ని రాజ్యాలుండేవి. అయినా, మంత్రి సుదర్శనుడి కుశాగ్ర బుద్ధీ, రాజ్యతంత్రంలో నేర్పువల్ల, ఆ పెద్ద రాజ్యాలు శ్రీపురాన్ని ఆక్రమించేందుకు ఏనాడూ ప్రయత్నించలేదు.

సుదర్శనుడికి క్రమంగా వయసుపైబడి వృద్ధాప్యదశకు వచ్చాడు. ఆయన తరచూ అనారోగ్యానికి గురవుతూండేవాడు. ఆస్థాన వైద్యులు ఆయనకు మంత్రిపదవి నుంచి విరమించి విశ్రాంతి తీసుకోవలసిందిగా సలహా యిచ్చారు.

ఈ సంగతి విన్న రాజు విద్యాధరుడు ఆయనతో, ''తమరు పదవీవిరమణ చేయడం తప్పనిసరిగా కనబడుతున్నది. పదవిలో వుండగానే, రాజ్యానికి ఒక మంత్రిని ఎన్నిక చేయవలసిందిగా కోరుతున్నాను,'' అన్నాడు.

సుదర్శనుడు అందుకు అంగీకరించి, మంత్రిపదవికి అర్హులైనవారికోసం రాజ్యంలో చాటింపు వేయించాడు. అది విన్న విద్యాధికులైన ఎందరో యువకులు రాజధానికి వచ్చి, సుదర్శనుణ్ణి చూడబోయారు. ఆయన వారికి ఎన్నో పరీక్షలు పెట్టి, అన్నిటిలోనూ సమాన ఉజ్జీలనిపించుకున్న ముగ్గురిని ఎన్నిక చేశాడు. ఇప్పుడు వారిలో ఒకరిని మంత్రిపదవిలో నియమించవలసి వున్నది.

వినయుడు, చంద్రకాంతుడు, శ్రీధరుడు అన్న ఆ ముగ్గురు యువకులనూ సుదర్శనుడు రాజు సమక్షంలో సభలో వున్నవారందరికీ పరిచయం చేసి, సేవకుల ద్వారా ఒక్కొకరికి బాగా బక్కచిక్కిన ఒక్కొక్క పిల్లిని యిప్పించి,

అనుపిండి శ్రీనివాసరావు

'మీరు మూడు నెలల కాలం, యీ పిల్లులను మీకు తోచినవిధంగా పెంచండి. అందుకుగాను ఖజానా నుంచి తలా ఒక వెయ్యి బంగారుకాసులు తీసుకోండి. మూడు నెలల తరవాత మీమీ పిల్లులతో యిక్కడికి రండి.'' అని చెప్పాడు.

మూడు నెలల తరవాత వినయుడూ చంద్రకాంతుడూ, శ్రీధరుడూ తమ తమ పిల్లులతో సభకు వచ్చారు.

వినయుడి పిల్లి చాలా బలిష్ఠంగా వున్నది. దానిని చూసి సభలో చాలా మంది, యిది పిల్లా లేక వయసువస్తున్న పులిపిల్లా అనుకున్నారు. శ్రీధరుడి పిల్లి ఆరోగ్యంగా, పుష్టిగా కనులకింపు కలిగిస్తున్నది. చంద్రకాంతుడి పిల్లి మాత్రం మరింతగా బక్కచిక్కిపోయి చావడానికి సిద్ధంగా వున్నట్టు కనిపించింది.

సుదర్శనుడు ఆ ముగ్గురినీ, పిల్లులను పెంచినతీరు చెప్పమని అడిగాడు.

ముందుగా వినయుడు, ''మీరిచ్చిన డబ్బుతో పిల్లికి పాలూ, వెన్నలతోపాటు పంచభక్ష్యపరమాన్నాలు పెట్టాను-అందుకు ఖర్చవగా మిగిలిన ఐదువందల బంగారు కాసులు, యివిగో!'' అన్నాడు.

తరవాత శ్రీధరుడు, ''పిల్లి ప్రధానంగా మాంసాహారిగదా. అందువల్ల, దాన్ని బాగా ఎలుకలు వున్న, నా మిత్రుడి ఇంట



వదిలేవాడిని. అయితే, రోజూ దానికి కడుపునిండుగా ఆహారం దొరక్కపోవచ్చునన్న సంశయంతో, పొద్దుటిపూట పాలు పోసేవాడిని. అందుకైన ఖర్చుపోగా, యివిగో మిగిలిన తొమ్మిదివందల బంగారు కాసులు!'' అన్నాడు.

చివరగా చంద్రకాంతుడు, ''పిల్లికి ప్రత్యేకంగా నేనేమీ ఆహారం పెట్టలేదు. అది చేతనైనంతలో తన ఆహారం సంపాయించుకుంటూ, వున్నది. పిల్లి లాంటి నిరుపయోగమైన జంతువు మీద డబ్బు ఖర్చుపెట్టడం వృథా. ఇవిగో, మీరిచ్చిన వెయ్యి బంగారుకాసులు. వీటితో ప్రజోపకరమైన పనులు చేయవచ్చు.'' అన్నాడు.

సభలో వున్నవారందరూ చంద్రకాంతుడు మంత్రిగా ఎన్నిక కాగలడని భావించారు. కాని, సుదర్శనుడు రాజుతో, సభికులతో, "శ్రీపురానికి మంత్రి కాగల అర్హతవున్నవాడు శ్రీధరుడు," అన్నాడు.

ఈ మాటలు రాజు విద్యాధరుడితో పాటు, సభికులకు కూడా ఆశ్చర్యం కలిగించినై. అది గ్రహించిన సుదర్శనుడు, "పిల్లులను పెంచిన తీరు యీ ముగ్గురూ చెప్పగా, మీరంతా విన్నారుగదా! వినయుడిలో ఇంగితజ్ఞానంపాలు తక్కువ. ఒక పిల్లిని పెంచేందుకు, మూడు నెలల కాలంలో ఐదువందల బంగారు కాసులు వ్యయం చేశాడు. ఎంత బలంగా, చురుగ్గా వున్నా—పిల్లి ఎలుకలను పట్టడానికి మించి చేయగల ఘనకార్యం ఏమీ వుండదు!

"ఇక చంద్రకాంతుడి సంగతి: ఇతడిలో వివేకాన్ని మించిన పిసినారిగుణం వున్నది. మచ్చుకైనా దయాగుణం, జీవకారుణ్యలక్షణాలు లేవు. ఇవి లేనివాడు ఒక రాజ్యానికి మంత్రిగా రాణించలేడు. పిల్లి చిక్కిపోతున్నప్పుడయినా, దానికి సరైన ఆహారం దొరకడం లేదని గ్రహించి, తగిన ఆహారం పెట్టవలసింది!

"ఈ పరీక్షలో నూటికి నూరుపాళ్ళు నెగ్గినవాడు శ్రీధరుడు. అతడు పిల్లికి సహజాహారమైన ఎలుకలకోసం, దాన్ని తన మిత్రుడింట వదిలాడు. ఆ విధంగా దాని ఆకలిబాధ నివారణ అవడమేగాక, ఆ మిత్రుడికీ కొంత ఎలుకలబాధ తప్పి వుంటుంది. అంతేకాక, ఎందుకైనా మంచిదన్న ముందుచూపుతో, దానికి ఒక్కపూట స్వయంగా పాలు పోశాడు. మంత్రి అయినవాడిలో వుండవలసిన వివేకం, విచక్షణాజ్ఞానం—అన్నీ శ్రీధరుడిలో సహజలక్షణాలనడంలో సందేహం లేదు. అందుకే, అతణ్ణి మంత్రిపదవికి ఎన్నిక చేశాను," అన్నాడు.

ఈ వివరణ విన్న సభికులు తమ హర్షామోదాలు తెలుపుతూ పెద్దగా కరతాళ ధ్వనులు చేశారు.






## 15

[చంద్రవర్మను చూసి రాజభటులు గొప్ప మాంత్రికుడని భ్రమపడ్డారు. మునలివాడి దగ్గిర నుంచి, చంద్రవర్మ కంచుకోటకు వెళ్ళే మార్గాన్ని తెలిపే పటం తీసుకున్నాడు. తరవాత భటులతో కలిసి, అతడు రుద్రపురం చేరాడు. పురవాసులు చంద్రవర్మను చూస్తూనే 'మహా మాంత్రికుడికీ జై!' అంటూ కేకలు పెట్టి గొప్పగా స్వాగతం చెప్పారు. తరవాత—]

చంద్రవర్మ రాజప్రాసాదాన్ని సమీపించే సరికి, ముఖద్వారం దగ్గిర రాజు శివసింహుడూ, మంత్రులూ, రాజోద్యోగులూ అతడికి ఎదురువచ్చి ఘనంగా స్వాగతం యిచ్చారు. చంద్రవర్మ గుర్రం దిగగానే రాజు అతడి దగ్గిరకు వచ్చి, ఎంతో అప్యాయంగా అతడి భుజం మీద చేయివేసి, "చంద్రవర్మా, ఇంత చిన్న వయసులో, నీ అంత గొప్ప మంత్రవేత్త లయినవాళ్ళు ఏ కాలంలోనూ లేరను కుంటాను. నా రాజ్యపు సరిహద్దుల్లో నివాసం ఏర్పరచుకుని, మహా కంటకుడుగా తయారైన శంఖుణ్ణి నీవు హతమార్చటం చూసి, నేనూ నా ప్రజలూ చాలా ఆనందపడ్డాం," అన్నాడు.

రాజు శివసింహుడు యిలా అనగానే చంద్రవర్మ ఎంతో ఆశ్చర్యపోయాడు. కాని, అతడు తన ఆశ్చర్యాన్ని బయటికి



కనబరచకుండా చిరునవ్వు నవ్వి, "ఆ శంఖుడు పరమ దుష్టుడు, మహాపాపి. అందుకే వాణ్ణి యమపురికి పంపాను," అన్నాడు.

"ఆ శంఖుడి కొండపై ప్రస్తుతం వుంటున్న నీ స్నేహితుడు కాలకేతుడి ద్వారా నిన్ను గురించి సర్వం తెలుసుకున్నాను. అతడి సలహాను పాటించే నిన్ను కంచుకోటకు వెళ్ళిరావలసిందిగా కోరేందుకు, నా భటులచేత యిక్కడికి ఆహ్వానించటం జరిగింది," అన్నాడు శివసింహుడు.

"కంచుకోట! అదెంతపని!" అంటూ చంద్రవర్మ చిరునవ్వు నవ్వాడు.

అంతలో మంత్రి రాజు చెవిలో ఏదో చెప్పగానే, రాజు ప్రాసాదం కేసి నడుస్తూ, "చంద్రవర్మా! నువ్వు ప్రయాణ బడలికలో వుండివుంటావు. భోజనం చేసి విశ్రాంతి తీసుకున్న తరవాత అన్ని సంగతులూ వివరంగా మాట్లాడుకుందాం," అన్నాడు.

చంద్రవర్మకు రాజగృహంలో చక్కని విడిది ఏర్పాటు చేయబడింది. అతడు స్నానం ముగించి రాగానే, రకరకాల పిండివంటలతో భోజనం పెట్టారు. తరవాత చంద్రవర్మ పట్టుపరుపులూ, బాలీశులూ పరచివున్న మంచం మీద పడుకుని నిద్రపోయేందుకు ప్రయత్నించాడు. కాని, అతడికి ఎంతకీ నిద్రపట్టలేదు. శంఖుడి కొండ మీద వుంటున్న కాపాలినీ, కాలకేతుల ద్వారా శివసింహుడు తనను గురించి కొంత తెలుసుకున్నాడు. కంచుకోటను చేరగలవాడు తనొక్కడే అని కాలకేతుడు శివసింహుడితో చెప్పటంలో వున్న రహస్యం ఏమిటి ?

ఈ విషయాన్ని గురించి కొంచెం సేపు తీవ్రంగా ఆలోచించేసరికి, చంద్రవర్మకు కాలకేతుడి ఎత్తుగడ ఏమిటో తెలిసిపోయింది. తను తిరిగీ రాజ్యం జయించుకునేందుకు డబ్బూ, బలగమూ కావాలి. వాటిని సంపాయించటానికి కంచుకోటలో



వున్నవని చెప్పబడే ధనరాసులు ఎంతో సహాయపడగలవు.

చంద్రవర్మ యిలాంటి ఆలోచనల్లో వుండగా సేవకుడొకడు వచ్చి, రాజుగారూ, ప్రధానమంత్రీ అతడికోసం సమాలోచన మందిరంలో వేచివున్నట్టుగా వర్తమానం చెప్పిపోయాడు. చంద్రవర్మ కొద్దిసేపటి కల్లా సమాలోచన మందిరానికి వెళ్ళాడు.

''చంద్రవర్మా, నేను కంచుకోటలో వున్న ధనరాసులకోసం ఆశించటం లేదు. ఆ సంగతి ముందుగానే నీతో చెప్పటం మంచిదని చెపుతున్నాను,'' అన్నాడు రాజు శివసింహుడు. చంద్రవర్మ తలాడించి వూరుకున్నాడు.

''అయితే, ఆ కంచుకోటను గురించి నాకింత ఆసక్తి ఎందుకన్న ప్రశ్న వస్తుంది. దానికి నే నివ్వబోయే సమాధానం కొంత చిత్రంగా వుండవచ్చు. కాని, అది ముమ్మాటికీ సత్యం. ఆ కంచుకోట సముద్రతీరాన వున్నదని తెలుసుగదా?'' అన్నాడు రాజు.

''అవును, పడమటి సముద్రతీరం. వెయ్యి సంవత్సరాల ఈ మధ్య దానిని చూసిన మానవ మాత్రుడెవడూ లేడు,'' అన్నాడు చంద్రవర్మ.

ఈ మాటలు వింటూనే మంత్రి ఆశ్చర్యంగా రాజుకేసి చూశాడు. రాజు తల పంకించి, ''కావొచ్చు. ఆ కంచుకోట గోడలను ఒకపక్క సముద్రజలం తాకుతూ వుంటుందని చాలామంది నమ్మకం, అవునా?'' అన్నాడు.

''అలా అనే నేనూ విన్నాను,'' అన్నాడు చంద్రవర్మ.

''ఆ గోడపక్కన వున్న సముద్ర జలంలో, ఒక మాంత్రికుడివల్ల కంచు కుండల్లో బంధించబడిన కొన్ని అపురూప ప్రాణులు వున్నవని మా పూర్వీకుల నమ్మకం. మా తండ్రిగారు వాటికోసం ఎంతో ప్రయత్నించారు. కాని ఫలితం కలగలేదు. ఇచ్ఛామాత్రంగా మానవ రూపాన్నీ, అంతలోనే మహా కాలనాగు

రూపాన్ని ధరించగల నీ స్నేహితుడు కాలకేతుడి ద్వారా, ఆ కంచుకుండలను నువ్వు తేగలవన్న ఆశ నాకు కలిగింది,'' అన్నాడు రాజు శివసింహుడు.

రాజు మాటలు వింటూనే చంద్రవర్మ యిందులో పెద్ద మోసం వున్నదని గ్రహించాడు. అపురూపప్రాణులున్నవని చెప్పబడే కంచుకుండలకోసం ఎవరూ యింత శ్రమపడరు. శివసింహుడికి కావలసింది కంచుకోటలో వున్నదనబడే ధనం. దానిని సాధించటం అతడివల్ల కాక, మంత్రశక్తులున్నవని భ్రమపడి తన సహాయం కోరుతున్నాడు. నిజంగానే కంచుకోటలో ధనరాసులు దొరికితే, వాటిని శివసింహుడి పాల పడకుండా, మోసానికి ప్రతిగా మరింత మోసాన్ని ప్రయోగించి తనవిగా చేసుకోగలనన్న ధైర్యం చంద్రవర్మకు కలిగింది.

''నాబోటి మంత్రవేత్తలకు కావలసింది, యిటువంటి కష్టసాధ్యమైన కార్యాలను సాధించటమే. నేను కంచుకోటకు వెళతాను. నా వెంట కొద్ది సిబ్బందిని పంపండి. వాళ్ళల్లో దేవలు డనే యువకుడు కూడా వుండటం అవసరం!'' అంటూ చంద్రవర్మ తన అరచేతికేసి పరీక్షగా చూసుకున్నాడు.

రాజు శివసింహుడూ, మంత్రీ ముఖముఖాలు చూసుకున్నారు ఓ క్షణకాలం ఆగి రాజు చంద్రవర్మతో, ''ఆ దేవలుడి తండ్రి అయిన ముసలివాడు అరణ్యంలో



తిరుగుతున్నాడు. వాణ్ణి నువ్వు కలుసుకున్నావా ?'' అన్నాడు.

''ఎవడా ముసలివాడు ? ఓహో....'' అంటూ చంద్రవర్మ తన అరచేతికేసి మరింత తీవ్రంగా చూసి, ''అతడు అడవిలోనే ఒక పూరిగుడిసెలో వున్నాడు. అతడికి అవసరమైన సౌకర్యాలన్నీ కలిగించండి. ఒకవేళ అతడు నగరానికి వచ్చి వుంటానంటే, అందుకు అవసరం అయిన ఏర్పాట్లు చేయండి. నేను కంచుకోటను చేరగలగటం, ఆ ముసలివాడి మీదా, అతడి కొడుకు దేవలుడి మీదా ఆధారపడి వున్నది.'' అన్నాడు.

చంద్రవర్మ చెప్పినదానికి రాజుగాని మంత్రిగాని కిక్కురుమనలేదు. ''అలాగే, అలాగే! నువ్వు చెప్పినట్టే చేస్తాను. దేవలుణ్ణి నువ్వు వెంటపెట్టుకుపోవచ్చు. నీకు రక్షణగా ఒక వెయ్యిమంది సైనికులు వుంటే సరిపోతుందా ?'' అన్నాడు రాజు.

ఆ మాటలకు చంద్రవర్మ బిగ్గరగా నవ్వి, ''నేను వెళుతున్నది ఎవరి మీదా యుద్ధానికి కాదు. ఒకవేళ యుద్ధమే చేయవలసివస్తే ...అది అదృశ్యంగా వుండి నా మార్గాన్ని అటకాయించే దుష్టశక్తుల మీద చేయవలసి వస్తుంది. దానికి నా మంత్రశక్తి తప్ప, మీ సైనికులు ఏమాత్రం సహాయకారులు కారు. నాకు కావలసిందల్లా ఆహారపదార్థాలు మోసేందుకు కొన్ని గాడిదలూ, వాటిని తోలేవాళ్ళూ, నా వెంట ఓ పదిమంది అనుచరులుంటే





సరిపోతుంది. వాళ్ళు సైనికులే కానవసరం లేదు,'' అన్నాడు.

''అలా కాదు. నా ఉద్యోగుల్లో నమ్మకస్థులూ, ధైర్య సాహసాలు కలవాళ్ళుగా చూసి నలుగురైదుగురిని నీ వెంట పంపుతాను. వారి వెంట ఓ యాభైమంది సైనికులుంటారు. నా రాజ్యపు ఎల్లలు దాటి నువ్వు పడమటి కనుమలు ప్రవేశించే ముందు, ఆ ప్రాంతాలకు మండలాధీశుడుగా వున్న వీరమల్లుడు, నీకు కావలసిన యితర సహాయమేదైనా వుంటే, అది చేస్తాడు,'' అన్నాడు రాజు.

వీరమల్లుడన్న పేరు వింటూనే చంద్రవర్మకు తన సేనానాయకుడు ధీరమల్లుడి పేరు గుర్తుకొచ్చింది. అతడూ, తనకు విశ్వాసపాత్రుడైన సేవకుడు సుబాహుడూ ఏమైపోయారో అని చంద్రవర్మ విచారంగా ఒక నిట్టూర్పు విడిచాడు.

''మహారాజా, మీకు తోచిన విధంగా చేయండి. రేపు సూర్యోదయం వేళ నా ప్రయాణం. కంచుకోటకు వెళ్ళే లోపల నేను మహారణ్యాలనూ, కొండలనూ, ఎడారులనూ దాటవలసి వుంటుంది. అహారపదార్థాలను మోసే జంతువులను, ఏ ప్రాంతానికి తగినవాటిని ఆ ప్రాంతంలో నేను ఉపయోగించవలసి వుంటుంది. అందువల్ల ఎడారుల్లో ప్రయాణించేటప్పుడు నాకు ఒంటెల అవసరం కూడా కలగవచ్చు. ఆ ఏర్పాట్లన్నీ సరిహద్దుల్లో వున్న మీ మండలాధిపతి వీరమల్లుడు చూసేలా తగిన ఏర్పాటు చేయండి,'' అన్నాడు చంద్రవర్మ.

''అవన్నీ నేను చూస్తాను. నువ్వేమీ అదుర్దాపడనవసరం లేదు,'' అన్నాడు రాజు శివసింహుడు.

మర్నాటి ఉదయం కంచుకోటదిక్కుగా చంద్రవర్మ ప్రయాణం ప్రారంభమైంది. శివపురం పొలిమేరలవరకూ రాజూ, మంత్రులూ, ప్రజలూ వెంట వచ్చి, చంద్రవర్మను సాగనంపారు. అతడి వెంట ముఖ్యానుచరుడుగా ముసలివాడి కొడుకు

దేవలుడున్నాడు. అతణ్ణి ఆ కిందటి రాత్రే కారాగారం నుంచి విడుదల చేశారు.

అడవులగుండా చంద్రవర్మ కొన్ని యోజనాల దూరం ప్రయాణం చేశాడు. అతడికి ముసలివాడు యిచ్చిన పటం మార్గాన్ని తెలుసుకునేందుకు అంతగా ఉపయోగించలేదు. కీకారణ్యాలూ, ఎత్తయిన కొండలూ తప్ప చంద్రవర్మకు ఎక్కడా మానవ సంచారం కనిపించలేదు. తను పడమటి దిక్కుగా పోతున్నదీ, లేక మార్గం తప్పినదీ-తెలుసుకునేందుకు అతడికి సూర్యోదయం, సూర్యాస్తమయాలే గుర్తులు.



ఇలా కొన్ని దినాలు ప్రయాణించిన తరవాత ఒకనాటి సూర్యోదయం వేళ దేవలుడు ఒక ఎత్తయిన రాతి మీద నుంచి పెద్దగా చప్పట్లుచరుస్తూ, "ఇదుగో, మనం ఏదో శిథిలనగరాన్ని చేరాం. ఇదే కంచుకోట కావచ్చు!" అని కేకలు పెట్టాడు.

ఆ కేకలు వింటూనే, చంద్రవర్మా అతడి వెంట వున్న రాజోద్యోగులూ పరిగెత్తుకుంటూ దేవలుడున్న చోటుకు వెళ్ళి, అతడు చెప్పిన దిక్కుగా దృష్టి సారించారు. ఎదురుగా కొండ దిగువను శిథిలావస్థలో వున్న ఒక మహానగరం వారి కంట బడింది. పడిపోయిన గోడలూ, ఒక పక్కకు ఒరిగి కూలటానికి సిద్ధంగా వున్న ఇంటి కప్పులూ, వాటి మధ్య చిత్తవొత్తుగా పెరిగిన చెట్టు చేమలూ—ఆ ప్రదేశమంతా భీతి కొల్పేలా వున్నది.

"ఇది కంచుకోట కాదు. అయినా మనం ఒకసారి ఆ శిథిలగృహాలను పరీక్షించి చూడటం మంచిది. నా వెంట రండి!" అంటూ చంద్రవర్మ రాతి మీది నుంచి దిగి శిథిల గృహాలకేసి బయలు దేరాడు.

అందరూ కలిసి వాటిని సమీపించే సరికి ఒకానొక పాడుబడ్డ ఇంటిముందు ఆడుకుంటూ వున్న మూడు పులిపిల్లలు వారికి కనిపించినై. అవి చంద్రవర్మనూ,

అతడి వెంట వున్నవారినీ చూస్తూనే బుసలుకొట్టి ఒక్క గంతులో రాళ్ల వెనకకు పారిపోయినై. ఆ మరుక్షణం పులి పెద్దగా గాండ్రించిన చప్పుడు వినబడింది.

ఆ ధ్వని వింటూనే చంద్రవర్మ ఠక్కున అక్కడే ఆగి, "మనం ఈ ఇంటిని సమీపించటం క్షేమం కాదు. మరో వైపుగా వెళదాం," అంటూ ఇంకో దిక్కుగా దారి తీశాడు.

దాదాపు అయిదారు ఆమడల వైశాల్యం వున్న ఆ శిథిలనగరంలో వారి కెక్కడా మానవమాత్రు డున్న సూచనలు కనిపించ లేదు. అక్కడ వున్న ప్రతి గృహం శిథిలావస్థలోనే వున్నది. కొన్ని కాలిపోయి నల్లగా మసిపూసినట్టున్నవి. ఒకప్పుడు మానవులు నివసించిన ఆ గృహాల్లో యిప్పుడు అడవి పంధులూ, చిరుతపులులూ లాంటి అడవి మృగాలు స్థావరం ఏర్పరుచుకున్నవి.

చంద్రవర్మ నగరం మధ్యకు వచ్చే సరికి అక్కడ ఎత్తయిన ఒక శిలాఫలకం కనిపించింది. దాని మీద కనిపించీ కనిపించనట్టుగా కొన్ని అక్షరాలు చెక్కబడి వున్నవి. చంద్రవర్మ శిలాఫలకాన్ని సమీపించి అక్షరం అక్షరాన్నీ కూడబలుక్కుంటూ మొత్తం శాసనాన్ని చదివాడు. అందులో వున్న ముఖ్య విషయం ఇది:

ఇది కరవీరపురము. వెయ్యి సంవత్సరాలు సర్వసంపదలతో తులతూగిన ఈ నగరాన్ని ఉత్తర దిశ నుంచి వచ్చిన బర్బరు లనబడే జాతివారు కొల్లగొట్టి, ఆ ధనాన్ని తమ రాజధాని కంచుకోటకు చేరవేశారు.

చంద్రవర్మ శాసనాన్ని చదివి తన అనుచరులకేసి తిరిగి, "ఇక మనం యిక్కడ కాలాన్ని వృథాపుచ్చటం మంచిది కాదు. ఈ శిథిల నగరంలో రాళ్ళూ రప్పలూ తప్ప మరేం లేవు. ఇది కంచుకోట కాదు. బయలుదేరండి." అన్నాడు.

అందరూ తిరిగి పడమటి దిక్కుగా ప్రయాణమయారు. —(ఇంకావుంది)






# నిదర్శనం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నిన్ను యింత కఠినమైన శ్రమతోకూడిన కార్యానికి పురిగొల్పినవాడు ఏ గురువో, భక్తుడో, యోగిలాంటివాడో అయివుంటాడని, నాకు అనుమానం కలుగుతున్నది. ఎందుకంటే, అలాంటివాళ్ళు తమ వాక్చాతుర్యంతో, ఎంతటి తెలివిమంతుడినైనా అపమార్గం పట్టించగలరు. అలాంటివారివల్ల, అతి తీవ్రమైన పరీక్షకు గురిచేయబడిన పూర్ణచంద్రుడనే అతడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ యిలా చెప్పసాగాడు:

రామచంద్రపురంలోని పూర్ణచంద్రుడికి, దేవుడంటే బొత్తిగా నమ్మకం లేదు.

## బేతాళ కథలు



ఒకసారి ఆ ఊరుకు ఒక యోగి వచ్చి, దైవభక్తి వలన కలిగే ప్రయోజనాలను గురించి బోధనలు చేశాడు. పూర్ణచంద్రుడు యోగిని ఒకనాడు ఏకాంతంగా కలుసుకుని, ''స్వామీ, మీరు పదేపదే దైవభక్తి గురించి చెబుతున్నారు. అసలు దేవుడున్నాడనడానికి, నిదర్శనమేమిటి ?'' అని అడిగాడు.

''నీ చుట్టూ వున్న యీ ప్రపంచమే దేవుడి ఉనికికి నిదర్శనం, నాయనా!'' అన్నాడు యోగి.

''దేవుడు లేడనుకున్నా వీచే గాలి అగదు, ప్రవహించే నది ఆగిపోదు. ఎవరి జీవితాలూ స్తంభించిపోవు. దేవుడున్నాడనుకునేందుకు, ప్రత్యేకమైన నిదర్శనం కావాలి. కేవలం నమ్మకం వల్ల కాక, నిజంగానే దేవుడివల్ల జరిగే విశేషమేమైనా వున్నదా ?'' అని అడిగాడు పూర్ణచంద్రుడు.

యోగికి పూర్ణచంద్రుడి సందేహం అర్థమయింది: మందు రోగాన్ని నయం చేస్తుంది. అన్నం ఆకలిని తీరుస్తుంది. శాస్త్రం సృష్టిరహస్యాలను తెలుపుతుంది- ఇవన్నీ మనిషి స్వయంకృషితో తెలుసుకున్నవి! వీటికి మనిషి నమ్మకంతో ఏమాత్రం ప్రసక్తిలేదు. దేవుడి విషయంలో అలా కాదు! కొందరు భక్తులు నమ్మకం కొద్దీ దేవుడున్నాడంటున్నారు; సరే, ఉన్నాడనుకుంటున్నాము. అందుకు సరైన నిదర్శనం లేదు.

''నీకు నిదర్శనమే కదా కావాలి? నిర్మలమైన మనస్సుతో, భగవంతుణ్ణి ఏదైనా కావాలని కోరుకో. ఆ కోరిక తీరుతుంది. అప్పుడు, దేవుడిని నమ్ముతావా?'' అని అడిగాడు యోగి.

''నాకే కోరికలూ లేవు. ఏమైనా కోరికలుంటే, భగవంతుణ్ణి అడగను. కష్టపడి సాధించుకుంటాను,'' అన్నాడు పూర్ణచంద్రుడు.

''ఒక సంవత్సరం తర్వాత, తిరిగి నేనీ ఊరికి వస్తాను. నేను చెప్పినట్టు చేసి

చూడు. నీకు నిదర్శనం కనబడుతుంది.'' అన్నాడు యోగి.

యోగి వెళ్ళిపోయినా, పూర్ణచంద్రుడా మాటల గురించి పట్టించుకోలేదు. యోగి తనకు ఏ విషయమూ సరిగ్గా చెప్పలేదనుకున్నాడు.

ఇలా వుండగా, ఆ ఊళ్ళోని భాగ్యవంతుడికి జబ్బు చేసింది. ఎన్ని మందులకూ, ఆ వ్యాధి నయంకావడం లేదు. జాతకదోషం ఏమైనా వున్నదేమో అని, ఆయన జాతకచక్రాన్ని పరీక్షించిన జ్యోతిష్కుడు, ''ఈ జబ్బు మందులకు నయం కాదు. నాస్తికుడొకడు ఆలయ ప్రవేశం చేసి, నిండు మనసుతో, యీాయన వ్యాధిని నయం చేయమని కోరుకుంటే, భగవంతుడు ఈ వ్యాధిని నయంచేస్తాడు,'' అని చెప్పాడు.

ఆ ఊరు మొత్తానికి పూర్ణచంద్రుడొకడే నాస్తికుడు! ఆ విషయం అందరికీ తెలుసు. భాగ్యవంతుడి బంధువులు కొందరు, పూర్ణచంద్రుడి ఇంటికి వెళ్ళి, విషయం చెప్పి వేడుకున్నారు.

ఇది విని పూర్ణచంద్రుడికి ఆశ్చర్యమయింది. తను ఆలయప్రవేశం చేయడం లేదని, ఆ భగవంతుడే నిదర్శనం చూపేందుకు, తనవద్దకు రప్పించుకుంటున్నాడా? అన్న అనుమానం కలిగిందతడికి. అందు



వల్ల, ఇందులోని నిజానిజాలు పరీక్షించాలనుకున్నాడు.

భాగ్యవంతుడి ప్రాణాలు రక్షించడం కోసం, పూర్ణచంద్రుడు మరునాడు ఆలయానికి వెళ్ళాడు. భగవంతుడి విగ్రహాన్ని శ్రద్ధగా చూసి నమ్మకం ఏర్పరుచుకుని, ''నువ్వే, ఈ జబ్బు తగ్గించి కాపాడాలి!'' అన్నాడు.

మర్నాటికల్లా, భాగ్యవంతుడి జబ్బు చేత్తో తీసినట్టు మాయమైంది. ఇందుకు పూర్ణచంద్రుడు చాలా ఆశ్చర్యపడ్డాడు. అయితే, అతడినియిప్పుడింకో అనుమానం బాధిస్తున్నది. ప్రార్థనలతో భగవంతుడందరికీ సుఖాన్ని ప్రసాదించగలిగితే,

ఈ ప్రపంచంలో యింకా యిన్ని సమస్య లెందుకుంటాయి ?

భాగ్యవంతుడి జబ్బు తగ్గడం, దేవు డున్నాడననడానికి నిదర్శనం కాదనీ, అది కాకతాళీయంగా జరిగిన విశేషమనీ— పూర్ణచంద్రుడు భావించాడు. కాని, అత డలా అని ఊరుకునేందుకు వీల్లేక పోయింది !

పూర్ణచంద్రుడి ప్రార్థన భాగ్యవంతుడి జబ్బు నయం చేసిందని తెలిసి, ఎక్క డెక్కడివాళ్ళూ ఆయన ఇంటికి రాసా గారు. వాళ్ళ, వాళ్ళ సమస్యలు వింటూంటే, పూర్ణచంద్రుడికి మతిపోయి నట్టయింది. ఈ ప్రపంచంలో ఎన్ని సమస్యలు ! వీటిని తన ప్రార్థన పరిష్క రిస్తుందంటే అతడికి నమ్మశక్యం కాకుండా వున్నది. అయినా, పూర్ణ చంద్రుడు నిర్మలమైన మనస్సుతో, వాళ్ళ సమస్యలను పరిష్కరించమని, ఆలయం లోని భగవంతుణ్ణి వేడుకున్నాడు. పూర్ణ చంద్రుడి ప్రతి ప్రార్థనా ఫలించింది.

ఈ విధంగా పూర్ణచంద్రుడికి చాలా కీర్తి వచ్చింది. జనం ఆయన ఇంటికి ప్రతి రోజూ తీర్థప్రజలా రాసాగారు. పూర్ణచంద్రుడు అందరి సమస్యలూ శ్రద్ధగా వినేవాడు. సమస్యా పరిష్కారం మనిషి చేతిలో లేదన్న గట్టి నమ్మకం కలిగి నప్పుడే, ఆయన వెళ్ళి దైవప్రార్థన చేసేవాడు. మిగతావారిని మందలించి పంపేస్తూండేవాడు.



కొంతకాలం జరిగాక, పూర్ణచంద్రుడి భార్య, భర్తను, "మీరు దైవప్రార్థనచేసి, ఎందరి సమస్యలో పరిష్కరిస్తున్నారు. మీలో యింతశక్తి వున్నప్పుడు, నా కోరిక ఎందుకు తీర్చరు?" అని అడిగింది.

"ఏమిటి, నీ కోరిక?" అన్నాడు పూర్ణ చంద్రుడు.

"మీరీ దేశానికి రాజు కావాలి; నేను రాణీని కావాలి!" అన్నది భార్య.

ముందు పూర్ణచంద్రుడిది తగదను కున్నాడు. కాని, దేవుడున్నాడనడానికి తిరుగులేని నిదర్శనం యిప్పుడే లభిస్తుం దని, అతడికి తోచింది.

అతడు వెంటనే ఆలయానికి వెళ్ళి, "ఈనాటికి సరిగ్గా వారం రోజుల్లో, నేనీ దేశానికి రాజును కావాలి. ఇప్పుడున్న రాజుకంటే చక్కగా నేను ప్రజాపాలన చేస్తాను. వాళ్ళ సమస్యలన్నీ పరిష్క రిస్తాను," అని ప్రార్థించాడు.

తర్వాత పూర్ణచంద్రుడు, తను రాజు అయినట్టే భావించాడు. అయితే, వారం రోజులు గడిచాయి. అతడి ప్రార్థన ఫలించ లేదు.

"మీరు మరీ పెద్ద కోరిక కోరారేమో! పోనీ, మన సంపద పెరగాలని కోరు కోండి," అన్నది పూర్ణచంద్రుడి భార్య.

పూర్ణచంద్రుడు అలాగే చేశాడు. అదీ ఫలించలేదు.

అప్పుడతడి భార్య, "మీరు యితరుల కోసం ప్రార్థనలు చేసి, వాళ్ళ సమస్యలు



పరిష్కరిస్తున్నారు గదా? అందుకు వాళ్ళ నుంచి ఏదైనా ప్రతిఫలం కోరండి. అలా వాళ్ళిచ్చే ప్రతిఫలంతో, మన సంపద క్రమంగా పెరుగుతుంది,'' అని సలహా యిచ్చింది.

పూర్ణచంద్రుడు అలాగే చేశాడు. అయితే, ఆ క్షణం నుంచీ అతడి ప్రార్థనలు ఫలించడం మానివేశాయి. క్రమంగా అతడి దగ్గిరకు వచ్చేవాళ్ళ సంఖ్య తగ్గి పోయింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, ఆలయంలో పూర్ణచంద్రుడివల్ల వచ్చిన మంచి ఫలితాలు, కాకతాళీయంగా జరిగిన వనే దాంట్లో సంశయానికి తావు లేదు గదా? అలా కానప్పుడు, అతడు దేశానికి రాజు కావాలని చేసిన ప్రార్థనా ఫలించి వుండాలి. కాని, అది ఫలించకపోగా, ఆ తర్వాత అతడి ప్రార్థనలేవీ సత్ఫలితాల నివ్వలేదు. భగవంతుడున్నాడనేందుకు నిదర్శనం చూపగలనంటూ, యోగి అతణ్ణి అపమార్గం పట్టించి మోసగించాడనే మాట నిజమా, కాదా? ఇందుకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ప్రథమంలో పూర్ణచంద్రుడు ఆలయంలో ప్రార్థన ద్వారా సాధించిన ఫలితాలు, కాకతాళీయంగా జరిగినవి కాదు. అయితే, అతడు స్వార్థబుద్ధితో తను రాజు కావాలని కోరి నప్పటి నుంచీ, అతడి ప్రార్థనలకు విలువ లేకుండా పోయింది. దేవుడి మహిమలు నిదర్శనానికే తప్ప, స్వప్రయోజనానికి పనికిరావు. స్వార్థబుద్ధితో మసిలేవాడికి భగవంతుడు సాయపడడు. నిస్వార్థ బుద్ధితో పూర్ణచంద్రుడు కోరిన కోరికలు ఫలించడమే, దేవుడున్నాడనేందుకు యోగి చూపిన నిదర్శనం. అందువల్ల, యోగి పూర్ణచంద్రుణ్ణి మోసగించాడనడం సరికాదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# మామూలు

కరణం భీమరాజుగారంటే అగ్రహారంలో అందరికీ హడలే. పెద్ద ఉద్యోగస్థులు సైతం భీమరాజు పేరు చెబితే జడుస్తారు. ఆ ఊరికి ఒకసారి ఒక గొప్ప జ్యోతిష్కుడు వచ్చాడు. ఊళ్ళో పెద్దలందరికీ జాతకాలూ, హస్తాలూ చూసి చెప్పి, బహుమతులు తెచ్చుకొన్నాడు. చివరికి ఊళ్ళో కరణం దర్శనానికి వెళ్ళాడు.

కరణంగారు అరుగు మీద కూర్చొని లెక్కలు వ్రాసుకొంటున్నారు. "సమస్కారమండీ, బాబూ!" అన్నాడు జ్యోతిష్కుడు.

"దయచేయండి! దయచేయండి!" అన్నాడు ఠీవితో కరణం భీమరాజు, చేతిలో కలం కింద పెట్టుతూ. కుశలప్రశ్నలయినై. జ్యోతిష్కుడు తను వచ్చిన పని చెప్పి, కరణంగారి హస్తం చేత పుచ్చుకొని అపరిమితమైన ఆసక్తితో ప్రారంభించాడు:

"ఆహాహా, భలే జాతకం కదండీ! శని ఏడింట ప్రవేశించడంతో తమరు ప్రభువులయ్యారు. సార్వభౌమపదవి అలంకరించవలసిన దివ్య జాతకం. అందుకనే మన గ్రామానికి తమరు కేవలమూ మకుటం లేని మహారాజులయ్యారు!" అంటూ చెప్పాడు.

చూడటం అంతా అయింతరవాత, "సరి, హస్త సాముద్రికానికి మీ మామూలెంత?" అని అడిగాడు కరణం భీమరాజు.

"దానికేముందండి? ఎవరి సంతోషం కొద్దీ వారు ఇస్తారు. లేనివాళ్ళు కూడా నాలుగు రూపాయిలు తక్కువ లేకుండా ఇచ్చారు. ధర్మప్రభువులు, గ్రామానికి మహారాజులు! తమ దగ్గర బేరాలేమిటి?" అన్నాడు జ్యోతిష్కుడు.

"మరి, మునిసీబుగారూ, పెద్ద దొర పుల్లయ్యగారూ, చిన్నపరాజుగారూ—పెద్ద

పెద్దలంతా వున్నారు కదా! వాళ్ళ నందరినీ చూడలేకపోయారూ?'' అన్నాడు భీమరాజు.

''క్షమించాలి. ముందుగా వారిని చూసుకునే వచ్చానండి, వచ్చే దారిలోనే కదా అని.'' అన్నాడు జ్యోతిష్కుడు.

''మరైతే, పసూలు ఏమాత్రం?'' అని మళ్ళీ ప్రశ్నించాడు కరణం.

''అయ్యా! నెలా పదిహేను రోజుల నుంచీ ఈ అగ్రహారం చుట్టుపక్కలే సంచారం చేస్తున్నాను. నిజానికి, ఈ గ్రామాలన్నీ లక్ష్మికి నివాసాలే. అందు లోన్నూ మన గ్రామంలో ఆదరణ మరీ ఎక్కువ. విద్యలు పోషించే మహాదాత లంతా ఇక్కడనే వున్నారాయె." అన్నాడు జ్యోతిష్కుడు.

''అదేనయ్యా, నీకు పదిరాళ్ళు దొరికి నవీ అంటే మాకదే సంతోషం. మా గ్రామానికి ఎవరైనా మీవంటి విద్వాం సులు వచ్చారంటే ప్రోత్సాహమివ్వాలి కదా!'' అన్నాడు కరణం.

పొంగిపోయాడు జ్యోతిష్కుడు. ''దాప రికమెందుకు బాబూ? సుమారు రెండు వందలు వసూలుంటుందండి'' అని చెప్పాడు.

భీమరాజు చిరునవ్వు నవ్వుతూ, ''భేష్! చెప్పావు కావేమయ్యా, పిడుగా! అలాగైతే మీరు చెప్పిన మొత్తం మీద రూపాయికి అయిదు దమ్మిడీలు చొప్పున వచ్చే ఐదు రూపాయిాల పావలా, కరణం మామూలు ముందు జమకట్టండి. మామూలు కట్టాలన్నది చిన్న పిల్లవాడికి కూడా తెలుసునే! ఇందులో మీ మామూలు నాలుగు రూపాయిలు మినహాయించుకొని తక్కిన రూపాయి పావలా కట్టెయ్యండి. తీరిపోతుంది.'' అన్నాడు.

బిత్తరపొయ్యాడు జ్యోతిష్కుడు. కరణం బాబు దగ్గిర వుంటే ఇంకా యేం ప్రమాదమోనని హడలుతూ, అతను రూపాయి పావలా వెంటనే కట్టేసి, కిక్కురుమనకుండా అక్కడనుండి వెళ్ళి పోయాడు.





మన దేవాలయాలు :

# కోణార్క

చంద్రభాగానది సముద్రంలో సంగమించే స్థలంలో వెలసిన సూర్యదేవాలయం సుప్రసిద్ధమైనది. శ్రీకృష్ణుడి కుమారుడయిన సాంబుడు సూర్య భగవానుణ్ణి ధ్యానిస్తూ ఇక్కడ చాలా సంవత్సరాలు గడిపినట్టు పురాణాలు పేర్కొంటున్నాయి.

పదమూడవ శతాబ్దంలో కళింగరాజ్యాన్ని పరిపాలించిన నరసింహదేవు డనే రాజు ఆ సుందరప్రదేశాన్ని సందర్శించి, అక్కడ సూర్యదేవాలయం నిర్మించాలని సంకల్పించాడు. అందుకోసం తన రాజ్యంలోని పన్నెండు వేలమంది శిల్పులను రప్పించాడు.





గొప్ప శిల్పకారుడూ, వాస్తుశాస్త్రజ్ఞుడూ అయినవిష్ణుమోహరాణా నాయకత్వంలో ఆలయనిర్మాణం ప్రారంభమయింది. సుదూర ప్రాంతాల నుంచి పెద్ద పెద్ద బండలూ, రాళ్ళూ అక్కడికి తరలించబడ్డాయి. శిల్పకళలో ప్రత్యేకస్థానం అలంకరించనున్న ఆ దేవాలయ నిర్మాణాన్ని సకాలంలో పూర్తిచేయడానికి శిల్పులు రాత్రింబవళ్ళు కృషి చేయసాగారు.



సూర్యభగవానుడి రథం పోలికతో— బ్రహ్మాండమైన చక్రాలతో, పెద్ద గుర్రాలు పూన్చిన విధంగా ఆలయ నిర్మాణం పూర్తికావచ్చింది. సంవత్సరం పొడవునా సూర్యకిరణాలు దేవాలయంలో పడే విధంగా గుడి ఈశాన్యాభిముఖంగా నిర్మించబడింది.

శిల్పి విష్ణుమోహరాణాకు స్వగ్రామంలో పద్నాలుగేళ్ళ ధర్మపాదు డనే కొడుకు ఉండేవాడు. అతడు తల్లివద్ద పెరుగుతూ, శిల్పశాస్త్రానికి సంబంధించిన తండ్రిగారి తాళపత్ర గ్రంథాలను శ్రద్ధగా పఠించసాగాడు. ఒకనాడు ధర్మపాదుడికి తండ్రిని చూడాలన్న కోరిక కలిగి తల్లి అనుమతితో కోణార్కకు బయలుదేరాడు.





ధర్మపాదుడు కాలినడకనే కోణార్కను చేరుకున్నాడు. కొడుకును చూడగానే తండ్రి అమితానందంతో కౌగిలించుకున్నాడు. అద్భుతమైన ఆ శిల్పకళా మందిరాన్ని చూసి ఆనందాశ్చర్యాలు చెందాడు ధర్మపాదుడు.

ఆలయనిర్మాణం పూర్తయిందికదా అని ఎవరూ సంతోషపడడం లేదు. పైగా శిల్పులందరూ విషాదవదనాలతో ఉండడం చూసి, ధర్మపాదుడు కారణం అడిగాడు. గోపురశిఖరాన్ని సక్రమంగా అమర్చే సూత్రాన్ని శిల్పులు మరచిపోయినట్టూ, అందుకే వాళ్ళందరూ విచారంగా ఉన్నట్టూ అతనికి వాళ్ళు చెప్పారు.





ఆలయం పూర్తికావడంలో జరిగే ఆలస్యానికి ఓర్పును కోల్పోయిన రాజు, మర్నాడు ఉదయానికల్లా గోపురకలశం పని పూర్తికాకపోయినట్టయితే, శిల్పులందరినీ చంపిస్తానని హెచ్చరించాడు. ధర్మపాదుడు ఆలయ గోపురాన్ని ఎక్కి పైకి వెళ్ళి అక్కడి కట్టడాన్ని పరిశీలించాడు. గోపురకలశం ఎలా అమర్చాలో శిల్పులకు తెలియచెప్పాడు.

ధర్మపాదుడి సాహసాన్ని శిల్పులందరూ మెచ్చుకున్నారు. తనయుడి సామర్థ్యం చూసి తండ్రి పరమానందం చెందాడు. అయినా అసూయాపరులైన శిల్పులు కొందరు, "పన్నెండు వేలమంది శిల్పులు చేయలేని పనిని ఒక కుర్రవాడు చేయడం మనందరికీ అవమానకరమైన విషయం కదా," అని గుసగుసలాడసాగారు. వారి గుసగుసలు విని ధర్మపాదుడు దిగ్భ్రాంతి చెందాడు!





అక్కడి నుంచి తను శాశ్వతంగా వెళ్ళిపోతే ఆ కార్యం తాను చేసినట్టు ఎవరికీ తెలియకుండా పోతుంది—అని ధర్మపాదుడు అనుకున్నాడు. అర్ధరాత్రి సమయంలో గోపురం మీదికి చేరుకున్నాడు. అది పున్నమిరేయి కావడం వల్ల సముద్రకెరటాలూ, నదీజలాలూ ఉవ్వెత్తునలేచి ఆలయప్రాంగణాన్ని తాకుతున్నాయి. ధర్మపాదుడు గోపురాగ్రం నుంచి సముద్రంలోకి దూకి ప్రాణాలర్పించాడు!

యుగాలు గడిచినా ధర్మపాదుడి సాహసం చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోయింది. ప్రధాన ఆలయం ఇప్పుడు లేదు కాని, ముఖశాల గోడ మీది సూర్య భగవానుడి సుందర శిల్పాలు చూపరులకు ఆనందాన్ని కలిగిస్తాయి.






కోణార్క దేవాలయ ముఖశాల గోడల మీది సుందర శిల్పకళాఖండాలు చాలా విలక్షణమైనవి. ప్రస్తుతం చంద్రభాగానదీ, సముద్రమూ ఆలయానికి దూరమయ్యాయిగాని, దేవాలయ ప్రాంతం ఇంకా ఎంతో ప్రశాంత గంభీరంగా అలరారుతున్నది!




పరంధామయ్యా అనే ఒక సన్నకారురైతు, కూతురు వివాహం ఖర్చులకుగాను, తనకున్న రెండెకరాల పొలం అమ్మి, పదివేల రూపాయిలు తెచ్చి ఇంట్లో దాచుకున్నాడు. అయితే, అతడు డబ్బు దాచే సమయంలో దూరపుబంధు వొకడు అక్కడే వున్నాడు. కొద్దిసేపటి తరవాత పరంధామయ్యా ఏదో పని మీద బయటికి వెళ్ళాడు. ఆ సమయంలో అతడి భార్య పెరట్లో వున్నది. ఇది అవకాశంగా తీసుకుని, ఆ బంధువు డబ్బు దొంగిలించి, ఇంటికి వెళ్ళి పోయాడు.

ఆ బంధువు పేరు శరభయ్యా. అతడికి పెళ్ళి కెదిగిన కూతురున్నది. కాబోయే అల్లుడికి కట్నకానులుకలిచ్చే స్థోమతులేక సతమతమవుతున్నాడు. ఆ కుర్రవాడు అదే ఊళ్ళో వున్న సోమయ్యా అనే అతని కొడుకు. ఆ సంబంధం స్థిరపరుచుకు వద్దామని, శరభయ్యా అప్పటికప్పుడే సోమయ్యా ఇంటికి బయలుదేరాడు.

అలా బయలుదేరే ముందు శరభయ్యా, తను దొంగిలించి తెచ్చిన డబ్బును అటక మీద పాతసామానుల మధ్య దాచిపెట్టాడు.

అయితే, అతడి కొడుకు సుభద్రయ్యా, తండ్రి చిన్న సంచీతో అటక ఎక్కడం గమనించాడు. తండ్రి బయటికి పోగానే, వాడు అటక ఎక్కి డబ్బు సంచీ తీసుకున్నాడు. వాడికి ఊళ్ళో తనలాగే అల్లరిచిల్లరగా తిరిగే నలుగురైదుగురు మిత్రులున్నారు. వాడు డబ్బు సంచీని రొండిన దోపుకుని, వాళ్ల ఇళ్లకు ప్రయాణమయాడు.

సుభద్రయ్యా పట్టరాని ఉత్సాహంతో అలా వీధిన పోతూండగా, రొండిన వున్న డబ్బు సంచీ జారి కింద పడిపోయింది. వాడదేం గమనించలేదు. కొంత సమయం గడిచాక, ఆ దారిన బండిలో సరుకులు

బొమ్మిడి అచ్చారావు



వేసుకువస్తున్న, ఆ ఊరి షావుకారు బంగారుశెట్టి, దాన్ని చూశాడు.

ఆయన బండి దిగి సంచీని తీసుకుని బండిలో వేసి, తిరిగి బండి ఎక్కాడు. సంచీలో ఏదో డబ్బున్నదన్న అనుమానం ఆయనక్కలిగింది. కాని, అక్కడే దాన్ని విప్పితే, పోగొట్టుకున్నవాళ్ళు వెతుక్కుంటూ అటు వచ్చి చూస్తారేమో అన్న అనుమానం కలిగిందాయనకు.

అయితే, బంగారుశెట్టి దుకాణానికి వెళుతూనే, బండిలో వున్న సరుకులు దుకాణంలో సర్దే హడావిడిలో, ఆ సంచీ మాట కాస్త మరిచిపోయాడు. కొంత సేపటికి గుర్తుకువచ్చి, దానికోసం వెతికితే, సరుకుల బస్తాల మధ్య ఆ సంచీ కనిపించలేదు.

జరిగిందేమంటే—సరుకులు సర్దుతున్న ఆయన పనివాడికి, ఆ సంచీ కనిపించింది. వాడు దాన్ని దుస్తుల్లో దాచుకుని, పని ముగియగానే ఇంటికి వెళ్ళాడు. వాడక్కడ సంచీ విప్పి చూశాడు. అందులో వున్న డబ్బు చూసి వాడి భార్య మూర్ఛపోయినంత పని చేసింది.

''ఇంత డబ్బు మన దగ్గిరున్నదని తెలిస్తే, మన ప్రాణాలకే ముప్పు. ఎవడో ఒకడు తెగించి దొంగిలించడానికి ప్రయత్నిస్తాడు. దీన్ని యిప్పుడే గుట్టు చప్పుడుకాకుండా, పెరట్లో పాతేద్దాం, పద!'' అన్నది వాడి భార్య.

కాని, వాళ్ళు అనుకున్నట్టు జరగలేదు. వాళ్ళిద్దరూ పెరట్లో గొయ్యితీసి డబ్బు పాతిపెట్టడం, పొరుగింట్లో వున్న శేషయ్య అనే అతను చూశాడు. అతడికి ఆ సంచీలో ఏదో విలువైన వస్తువున్నదన్న అనుమానం కలిగింది. పనివాడూ, వాడి భార్యా ఇంట్లోకి వెళ్ళి తలుపులు మూసుకోగానే, అతడు పెరటిగోడ దూకి వచ్చి, గొయ్యి మీది మట్టి లాగి, సంచీ తీసుకుని, తిరిగి గోడ మీదుగా తన పెరట్లోకి దిగాడు.

అది మంచి నడిరాత్రి సమయం. శేషయ్య ఇంటికి కన్నం వేయడానికి

వచ్చిన దొంగ ఒకడు, శేషయ్య చేసిన దంతా చూశాడు. వాడికి శేషయ్య కూడా తనలాగే దొంగ అన్న అభిప్రాయం కలిగింది. దొంగసొమ్ములో వాటా అడగాలనుకుంటూ, వాడు శేషయ్యను సమీపించాడు. శేషయ్య వాణ్ణి చూస్తూనే దొంగ అని అరవబోయి, తన చేతిలో వున్నది దొంగసొత్తని గుర్తురాగానే, దాన్ని అక్కడే జారవిడిచి ఇంట్లోకి పరిగెత్తాడు.

దొంగ తన అదృష్టానికి మురిసిపోతూ, సంచీ తీసుకుని పరిగెత్తసాగాడు. అయితే, వాడి దురదృష్టం కొద్దీ కొన్ని కుక్కలు అరుస్తూ, వాడి వెంటపడ్డాయి. చుట్టుపక్కల ఇళ్ళవాళ్ళు నిద్రలేచి పరుగెత్తుకురాసాగారు. ఇది చూసి తను దొరికిపోతానన్న భయంతో దొంగ డబ్బు సంచీని రహదారి పక్కకు గిరవాటు వేశాడు.

ఆ ఊళ్ళోని సిద్ధాంతికి తెల్లవారు జామునే కాలవకు వెళ్ళి స్నానం చేసి రావడం అలవాటు. ఆయన అలా స్నానం చేసి వస్తూండగా, దారి పక్కన పడివున్న డబ్బు సంచీ కళ్ళబడింది. సిద్ధాంతి దాన్ని తీసుకుని, అందులో డబ్బున్నదని ఆనందపడుతూ, ఇల్లు చేరే సమయానికి, ఇంటిముందు కొందరు గ్రామస్థులు కూర్చుని వుండడం కనిపించింది. వాళ్ళు, ఆయన చేత ఏదో పెళ్ళి ముహూర్తం పెట్టించుకోవడానికి వచ్చినవాళ్ళు.

సిద్ధాంతి వాళ్ళను చూస్తూనే, తుండుగుడ్డచాటున డబ్బు సంచీ దాచి ఇంట్లోకి



వెళ్ళాడు. ఆయన దాన్ని ఉయ్యాల బల్ల మీద పెట్టి, తన కోసం వచ్చినవాళ్ళతో మాట్లాడేందుకు బయిటికి వచ్చాడు.

సిద్ధాంతి భార్య బట్టలు తకడానికి నీలాటి రేవుకు వెళుతూ, మరి కొన్ని బట్టలతోపాటు భర్త ఉయ్యాలబల్ల మీద పెట్టిన తుండుగుడ్డను కూడా బిందెలో వేసుకున్నది. ఆమె తుండుగుడ్డలో చుట్టి వున్న డబ్బు సంచీని గమనించలేదు.

సిద్ధాంతి భార్య నీలాటి రేవు చేరిన సమయంలో, అక్కడ పరంధామయ్య భార్య బట్టలు తుకుతున్నది. ఇద్దరూ కబుర్లాడుతూ పని ముగించుకుని, బట్టలను బిందెల్లో వేసుకుని ఇళ్ళకు బయలు దేరారు. అయితే, ఆ సమయంలో ఒక పొరబాటు జరిగిపోయింది. ఇద్దరి బిందెలూ, ఆ మధ్య సంతలో కొన్న ఒకే రకపువి కావడంతో, ఒకరి బిందె నొకరు తీసుకోవడం జరిగింది.

పరంధామయ్య భార్య ఇంటికి వచ్చి, ఉతికి తెచ్చిన బట్టలు ఆరవేస్తూండగా, బిందె అడుగున ఆమెకు సంచీ కనిపించింది. ఆమె సంచీ ముడిని విప్పి చూసింది. లోపల రూపాయిలు.

ఆమె వాటిని చూసి ఆశ్చర్యపోతున్నంతలో, పరంధామయ్య అక్కడికి వచ్చి, "ఏమేవ్, నిన్న సాయంత్రం చందువా పెట్టెలో రూపాయిల సంచీ దాచాను. అది కనబడడం లేదు. నువ్వు గాని తీశావా?" అంటూ భార్య చేతిలోని డబ్బు సంచీ చూసి, "ఇది నువ్వెందుకు తీశావు? దీని కోసం గంట నుంచి వెతుకుతున్నాను," అని సంచీ తీసుకున్నాడు.

పరంధామయ్య భార్యకు ఆ డబ్బు సంచీ తన బిందెలోకి ఎలా వచ్చిందో అర్థం కాలేదు. పొరబాటున తనే బట్టలతో పాటు దాన్ని తీసుకుపోయానేమో అనుకుని, సమాధానపడింది.

ఏది ఏమైనా చివరకు పోయిన సొమ్ము పరంధామయ్యకు తిరిగి దక్కింది. ఆ కారణం వల్ల, ఆయన కూతురు పెళ్ళి నిర్విఘ్నంగా జరిగిపోయింది.





# శివపురాణం

విష్ణుమూర్తి ఆదిశేషుడితో, "ఈ దేవతల కోసం నువు వెళ్ళి, మందరపర్వతాన్ని పెకలించి, దాన్ని తీసుకుపోయి పాల సముద్రంలో వేసి రా!" అన్నాడు. ఆదిశేషుడు అలాగే చేశాడు.

పాలసముద్రాన్ని చిలికితే వచ్చే అమృతంలో కొంత భాగం సముద్రుడికి ఇవ్వటానికి దేవతలు ఒప్పుకున్నారు. కాని అంతటితో సమస్య తీరిపోలేదు. మందర పర్వతం పాలసముద్రంలో మునిగిపోయింది. దాన్ని ఎవరన్నా ఎత్తిపట్టి ఉంచితే తప్ప పాలసముద్రాన్ని చిలకటం దేవ దానవులకు సాధ్యం కాదు.

దేవతలు మళ్ళీ విష్ణువును ప్రార్థించారు. విష్ణువు మహా కూర్మరూపం ధరించి తన వీపున మందరపర్వతాన్ని పైకెత్తి ఉంచటానికి ఒప్పుకున్నాడు.

అంతా అమరింది గాని చిలకటానికి కవ్వపుతాడు లేదు. అప్పుడు వాసుకి తాను కవ్వపు తాడుగా ఉండటానికి ఒప్పుకున్నాడు. దేవతలూ, దానవులూ పాల సముద్రాన్ని మథించసాగారు. అయితే దేవతలు వాసుకిని తలవైపు పట్టుకుంటామంటే దానవులు అందుకు ఒప్పుకోక, "మేము వాసుకి తోక పట్టుకుంటామా? అదేమీ కుదరదు," అని వాళ్ళే వాసుకి తలను పట్టుకుని, తోకను దేవతలకిచ్చారు.

సముద్ర మథనం జరుగుతూ ఉంటే వాసుకి నోళ్ళ నుంచి వెలువడే సెగలూ,

**13. హాలాహల భక్షణం**



పొగలూ దానవులను బాధించసాగాయి. ఆ సెగ దేవతలకు కూడా కొద్దిగా సోకింది గాని, వారు అంతగా బాధపడలేదు.

దేవదానవులు ఈ విధంగా ఎంతో శ్రమపడి పాలసముద్రాన్ని దీర్ఘకాలం మథించిన మీదట అందులో నుంచి అమృతం పుట్టకపోగా హాలాహలం పుట్టి, అమిత వేగంగా అన్ని దిక్కులకూ, వ్యాపించసాగింది.

ఇది చూసి అందరూ హడలిపోయారు. ఏం చెయ్యటానికీ తోచక, వేగంగా కైలాస పర్వతానికి పరిగెత్తి, అక్కడ పార్వతీ సహితుడై ఉన్న శివుణ్ణి చూసి, "దేవదేవా! హాలాహల విషం మూడు లోకాలనూ దహించుతున్నది. దాని నుంచి మమ్మల్ని రక్షించు. లోకాల కన్నిటికీ నువే ఈశ్వరుడివి. నీ పరమ జ్యోతిస్సు దేవతలకూ, దేవేంద్రుడికీ, బ్రహ్మకూ, విష్ణువుకూ అంతు చిక్కేది కాదు." అని స్తోత్రాలు చేశారు.

వారి దుస్థితి చూసి శివుడు జాలిపడి పార్వతితో, "వీళ్ళు క్షీరసాగరాన్ని మథించటం చేత కాలకూట విషం పుట్టి ప్రజలకు ఎలాటి విపత్తు సంప్రాప్తమయిందో చూశావా? అందుచేత నేను విషాన్ని మింగేస్తాను," అన్నాడు.

అందుకు పార్వతి ఒప్పుకున్నది.

అప్పుడు శివుడు, లోకా లన్నిటికీ వ్యాపించే హాలాహల విషమంతా పోగు చేసి తన అరచేతిలోకి తీసుకుని, నోట్లో వేసుకుని లోపలకు మింగకుండా కంఠంలో వుంచాడు. మహేశ్వరుడి పైన కూడా ఆ విషం తన ప్రభావాన్ని కొద్దిగా చూపకుండా ఊరుకోలేదు. ఆయన కంఠం కమిరి పోయింది. అది మొదలు శివుడికి నీలకంఠుడు అనే పేరు వచ్చింది.

శివుడు కాలకూటాన్ని తొలగించిన మీదట దేవదానవులు తిరిగి పాల సముద్రాన్ని మథించసాగారు. అప్పుడు అందులో నుంచి కామధేనువు పుట్టింది; దాన్ని యజ్ఞం కోసం ఋషులు తీసు



కున్నారు. తరవాత ఉచ్చైశ్రవ మనే అందమైన తెల్లని, గొప్ప గుర్రం పుట్టింది. బలి దాన్ని కోరాడు; ఇంద్రుడు కోరుకుందా మనుకున్నాడు గాని, విష్ణువు అతన్ని వారించాడు.

తరవాత పాలసముద్రం నుంచి ఐరావతం అనే తెల్లని ఏనుగు నాలుగు దంతాలు కలది పుట్టింది. తరవాత పారిజాతం పుట్టింది. ఆ తరవాత అప్సరసలు పుట్టారు. తరవాత దేదీప్యమానంగా వెలిగిపోతూ లక్ష్మిదేవి పుట్టింది. ఆమె స్వయంగా విష్ణువు వక్షస్థలాన్ని వరించింది. లక్ష్మిదేవితో బాటు పాలసముద్రం నుంచి చంద్రుడు పుట్టాడు.

అన్నీ పుట్టిన అనంతరం పాలసముద్రం నుంచి ధన్వంతరి అమృత కలశం చేత పట్టుకుని బయటికి వచ్చాడు. వెంటనే దైత్యులు ఆ అమృతకలశాన్ని చప్పున లాగేసుకుని దూరంగా పారిపోయి, అక్కడ తమలో తాము కీచులాడుకోసాగారు. అప్పుడు దేవతలు విష్ణువుతో మొర పెట్టుకోగా, "విచారించకండి. నేను మాయ చేసి, అమృతం మీకే దక్కేటట్టు చేస్తాను," అని విష్ణువు అన్నాడు.

వెంటనే ఆయన అమిత అకర్షణీయమైన మోహినీరూపం ధరించి దైత్యులను సమీపించాడు. వాళ్ళు ఆ మోహినిని చూసి మతులు పోయినట్టుగా అయిపోయారు. వాళ్ళు మోహినితో, "ఈ అమృతం కోసం మాలో మేము తగువులాడుకుంటున్నాం. నువు న్యాయంగా మాకు దీన్ని పంచిపెట్టు," అన్నారు.

"నేను చేసేదానికి ఆక్షేపణ చెప్పకుండా ఉంటే అలాగే పంచుతాను," అన్నది మోహిని. దైత్యులు అందుకు ఒప్పుకున్నారు.

మోహిని దేవతలనూ, దానవులనూ వేరు వేరు పంక్తులలో కూర్చోబెట్టి, దేవతల పంక్తికి అమృతం పంచసాగింది. అన్న మాటకు కట్టుబడి దైత్యులు అభ్యంతరం చెప్పలేదు. దేవత లందరూ



అమృతం తాగగానే విష్ణువు మోహినీ రూపం ఉపసంహరించుకున్నాడు.

విష్ణువు మోహినీ రూపంలో దైత్యులను మభ్యపెట్టి అమృతాన్ని దేవతల కిచ్చిన మాట విని, శివుడు పార్వతీదేవితో సహా వృషభవాహనం మీద విష్ణువును చూడ వచ్చి, "నీ అవతారాలన్నీ చూశాను గాని, మోహినీ రూపం ధరించావట, ఆ రూపాన్ని చూద్దామని వచ్చాం." అన్నాడు.

"దైత్యులను సమ్మోహించటానికి ధరించిన ఆ రూపాన్ని మీకు కూడా చూపిస్తాను." అంటూ విష్ణువు అదృశ్యుడై, మోహినీ రూపంలో బంతితో ఆడుతూ కనిపించాడు.

ఆ మోహినిని చూడగానే శివుడు తన వెంట ఉన్న పార్వతినీ, ప్రమథ గణాలనూ పూర్తిగా మరచిపోయాడు. అందరూ చూస్తూ ఉండగానే శివుడు ఆ మోహిని వెంట పోసాగాడు. అంతలోనే ఆయనకు ఇదంతా విష్ణుమాయ అన్నది స్ఫురణకు వచ్చింది. విష్ణువు శివుడి ఆత్మనిష్ఠను మెచ్చుకున్నాడు.

తరవాత శివుడు విష్ణువు వద్ద సెలవు పుచ్చుకుని పార్వతితో సహా కైలాసానికి తిరిగి వచ్చాడు.

పూర్వం అయోధ్యానగరాన్ని బాహువు అనే రాజు పరిపాలించేవాడు. హైహయులు ఈయన రాజ్యం మీద దాడి చేసి ఇతన్ని వెళ్ళగొట్టారు. అప్పుడాయన తన భార్యలతో సహా అడవులకు వెళ్ళాడు.

అక్కడ ఉండగా బాహువు భార్యలలో ఒకతె గర్భవతి అయింది. ఇంతలో బాహువు మరణించాడు. గర్భవతి అయిన భార్య, భర్తతో సహగమనం చేయబోయింది. కాని ఔర్వుడనే ముని ఆమెను వారించి, ఆమెకు కొడుకు కలుగుతాడని చెప్పాడు.

ఇది తెలిసి ఆమె సవతులు ఆమెకు విషం పెట్టారు. ఆ విషంతో సహా ఆమెకు పిల్లవాడు పుట్టాడు. అతనికి సగరుడు (విషంతో కూడినవాడు) అన్న పేరు వచ్చింది.

సగరుడు కాలక్రమాన చక్రవర్తి అయి, ఔర్వుడి సహాయంతో అనేక అశ్వమేధాలు చేశాడు. అతడికి సుమతీ, కేశినీ అని ఇద్దరు భార్యలు. అయితే అతనికి సంతానం లేకపోయింది. అందుచేత ఆయన అడవికి వెళ్ళి, ఔర్వుణ్ణి కలుసుకున్నాడు.

సగరుడి భార్యలకు సంతానం కలుగుతుందనీ, అతను తన భార్యలతో కైలాసానికి వెళ్ళి తపస్సు చెయ్యాలనీ ఔర్వుడు చెప్పాడు. సగరుడు అలాగే కైలాసానికి వెళ్ళి, శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. శివుడు సగరుడికి సంతానం కలిగేటట్టు వరమిచ్చాడు.

సగరుడు నగరానికి తిరిగి వచ్చినాక అతని ఇద్దరు భార్యలూ గర్భవతులై ఇద్దరు మగపిల్లలను కన్నారు. కేశినికి అసమంజసుడు కలిగాడు. ఔర్వుడు వచ్చి, సుమతికి పుట్టినవాడిలో అరవైవేల మంది కుమారు లున్నట్టు చెప్పి, ఆ బిడ్డను అరవైవేల ఖండాలు చేయించి, కుండలలో పెట్టించాడు. ఆ కుండలలో నుంచి అరవైవేలమంది కుమారులు పుట్టారు.

కేశిని కొడుకైన అసమంజసుడు మహా భయంకరమైన పనులు చేసేవాడు. వాడు చిన్నవాళ్ళనూ, పెద్దవాళ్ళనూ నదిలో పారేసేవాడు. వాడి చర్యలు సహించలేక ప్రజలు వెళ్ళి సగరుడితో చెప్పుకున్నారు. సగరుడు అసమంజసుణ్ణి నగరం నుంచి వెళ్ళగొట్టించాడు.

తరవాత సగరుడు మళ్ళీ అశ్వమేధ యాగం చేయ నిశ్చయించి, యాగాశ్వాన్ని వదిలి, దాని వెంట తన అరవైవేలమంది కొడుకులనూ పంపాడు.

సగరుడు వదిలిన అశ్వం ఒక చోట తిరుగుతూ ఆకస్మికంగా మాయమయింది. సగరుడి కొడుకులు దానికోసం వెతికి, వెతికి, లాభం లేక నగరానికి తిరిగి వెళ్ళి, గుర్రం మాయమయిందని తండ్రితో చెప్పారు. సగరుడు వారిమీద మండిపడి, గుర్రం లేకుండా నగరంలోకి అడుగు పెట్టవద్దని కొడుకులను శాసించాడు.





# అమ్మవారి నగలు

నాగవరంలో వున్న ఒక పురాతనమైన అమ్మవారి గుడికి, శివయ్య పూజారి. ఆ గ్రామానికి పొరుగున వున్న కేశవపురం జమీందారు, ఒకసారి జాతరవేడుకలలో, అమ్మవారికి ముక్కుపుడకా, కాసుల పేరూ, వడ్డాణం లాంటి బంగారునగలు చేయించి అలంకరించాడు. అప్పటి నుంచీ అమ్మవారి విగ్రహం మరింత చూడ ముచ్చటగా తయారయింది. ఈ బంగారు ఆభరణాలు ఎవరూ దోచుకుపోకుండా కాపాడవలసిన బాధ్యత, పూజారి శివయ్యకు అప్ప చెప్పబడింది.

శివయ్య భార్య రమణమ్మ పరమ గయ్యాళి. ఆమె కోరినవి వెంటనే తెచ్చి యివ్వకపోతే, యిక ఆ రోజుకు అతడికి భోజనం వుండేదికాదు.

అమ్మవారికి కొత్తగా నగల అలంకరణ జరిగాక, రమణమ్మ దృష్టి వాటి మీద పడింది. వాటిని ధరించాలన్న కోరిక రోజు రోజుకూ ఎక్కువ కావడంతో, ఆమె భర్తను ఆ నగలు తెమ్మని బలవంత పెట్టింది.

భార్య కోరిక విని శివయ్య నిలువెల్లా చలించిపోయి, ''ఏమే, నీకేమన్నా పోయే కాలందగ్గిరపడిందా! అమ్మవారి నగలను, సామాన్య స్త్రీవైన నువ్వు ధరించడం మహా పాపం. అంతగా కావాలంటే, అలాంటివే చేయిస్తాను. కాస్త ఓపికపట్టు,'' అన్నాడు.

కాని రమణమ్మ అందుకు ఒప్పుకోక, ''నువ్వు, ఈ రాత్రికి నగలు తీసుకురాక పోతే, రేపు సూర్యోదయం వేళకు మన పెరట్లో వున్న వేపచెట్టుకు ఉరేసుకు చస్తాను!'' అని భర్తను బెదిరించింది.

భార్య అన్నంతపనీ చేస్తుందని భయపడి, శివయ్య ఆ రాత్రి అమ్మవారి గుడికి వెళ్ళి, అమ్మవారి విగ్రహం ముందు

రాంబాబు



చేతులు జోడించి, "అమ్మా, నా భార్య గయ్యాళితనం, నీకు తెలియంది కాదు గదా! దాన్ని మెల్లిగా బుజ్జగించి త్వరలోనే, నీ నగలు నీకు అప్పజెబుతాను. క్షమించ దగనిపని చేస్తున్నప్పటికీ, నన్ను క్షమించ మని వేడుకుంటున్నాను!" అంటూ విగ్రహానికున్న నగలన్నీతీసిమూటకట్టాడు.

శివయ్య గుడి నుంచి బయటికి రాబో తూండగా, అమ్మవారికి సన్నిహితురాలైన మరొక దేవత ఆమెను చూడవచ్చి, శివయ్య చేసిన పని గమనించింది.

ఆమె అమ్మవారితో, "నీ నగలు తీస్తూంటే, ఏమీ పట్టనట్టు చూస్తూ ఊరు కున్నావేం? నగలు లేకపోతే, నీ విగ్రహం కళ కోల్పోతుంది. వెంటనే పూజారికి బుద్ధి చెప్పు." అని హెచ్చరించింది.

దానికి అమ్మవారు చిన్నగా నవ్వి, "ఈ శివయ్య, నా భక్తుడు. నాకు ముందుగా క్షమాపణ చెప్పి, వాటిని తిరిగి పట్టుకు వస్తానని మాట యిచ్చాడు. ఇతడి భార్యకు నాలుగు రోజుల వ్యవధి యిస్తున్నాను. ఈ నాలుగు రోజుల్లో, నగలను తిరిగి ఆమె భర్తకు యివ్వకపోతే, తల పగిలి చస్తుంది!" అన్నది.

నగలమూటతో బయటికి వస్తున్న శివయ్యకు, అమ్మవారు అన్న ఆఖరి మాటలు వినిపించినై. అతడు భయంతో వణుకుతూ, అమ్మవారి విగ్రహం కేసి చూస్తూ నిలబడిపోయాడు. అయితే, ఆ తరవాత అతడి కెలాంటి మాటలూ వినిపించలేదు. దానితే, తాను భ్రమపడ్డా నేమో అన్న సంశయం కలిగింది శివయ్యకు.

అతడు గుడికి భద్రంగా తాళం వేసి, నగలమూటతో ఇంటికి వచ్చి, వాటిని భార్య కిచ్చాడు. రమణమ్మ ఆనందపడి పోతూ, అమ్మవారి నగలను అప్పటి కప్పుడే ధరించింది.

శివయ్య, భార్య కేసి కోపంగా చూస్తూ, తను అమ్మవారి గుడిలో విన్న మాటలు చెప్పాడు.

ఆమె భర్త కేసి మరింత కోపంగా చూస్తూ, "నీలో పిరికిపాలు ఎక్కువ. అమ్మవారి నగలు తీసుకుపోతున్నానన్న భయం కొద్దీ, ఏవో మాటలు విన్నానని భ్రమపడ్డావు. నేను మాత్రం, యీ నగలు యిచ్చేదిలేదు!" అన్నది.

"నా భార్యను కాపాడే భారం, నీదే నమ్మా!" అని శివయ్య, అమ్మవారికి మనసులోనే మరొకసారి మొక్కుకున్నాడు.



మూడు రోజులు గడిచాయి. రమణమ్మ మాత్రం తన ఒంటి మీది నుంచి అమ్మవారి నగలు తీయలేదు. శివయ్యకు అమ్మవారి మాటల మీద గురి ఏర్పడి, కంగారు పడిపోసాగాడు.

ఆ రాత్రి రమణమ్మ నగలు తీయకుండానే నిద్రపోయింది. సరిగా అర్ధరాత్రి వేళ శివయ్య ఇంట ఒక దొంగ ప్రవేశించాడు. వాడు బాగా నిద్రమత్తులో వున్న రమణమ్మ ఒంటి మీది నగలన్నీ బహు చాకచక్యంగా తస్కరించాడు. తరవాత, వాడు ఆ నగలమూటతో అమ్మవారి గుడి కేసి వెళ్ళాడు.

దొంగ ప్రయత్నమేమంటే—అమ్మవారి నగలు కూడా దొంగిలించాలని. కాని, వాడు గుడి ముందుకు వెళ్ళేసరికి, గుడి తాళం బద్దలు కొట్టబడి తలుపులు బార్లా తెరిచి వున్నవి. అది చూసి వాడు చాలా ఆశ్చర్యపడ్డాడు. తనకన్న ముందే ఎవడో గుడిలో జొరబడ్డాడని గ్రహించి, చేతిలో వున్న దుడ్డుకర్రను బలంగా గుప్పిట బిగించి, గుడిలోకి వెళ్ళాడు.

అయితే, అంతకు ముందే గుడి తాళం బద్దలు కొట్టి లోన ప్రవేశించిన మరొక దొంగ, అమ్మవారి విగ్రహానికి నగలు లేక పోవడం చూసి గతుక్కుమన్నాడు. వాడికి ఆ నగలను మరెవడో దోచుకుపోవడమో, లేక రక్షణకోసం పూజారి ఇంటికి తీసుకుపోవడమో జరిగి వుంటుందన్న అనుమానం కలిగింది. వాడు నిరాశతో బయటికి వస్తున్నాడు.

ఆ సమయంలో వాడికి నగలమూటతో లోపలికి వస్తున్న దొంగ కంటబడ్డాడు. వెంటనే వాడు చేతిలో వున్న దుడ్డుకర్రను పైకెత్తి, "ఒరే, నా కన్నుముందే వచ్చి, నగలు దోచుకుని మూట కట్టావన్న మాట!" అంటూ దొంగ తల మీద కొట్టాడు.

ఇలా జరుగుతుందని ముందే ఊహించిన రెండో దొంగ, అదే క్షణంలో గుడి తాళం బద్దలు కొట్టిన దొంగ తల మీద దుడ్డుకర్రతో ఒక బాదుబాదాడు. దానితో యిద్దరూ స్పృహతప్పి కిందపడిపోయారు.

తెల్లవారుజామున నిద్రమెలుకువ వచ్చిన రమణమ్మ, ఒంటి మీద నగలు లేకపోవడం తెలుసుకుని, ఒక్క కేక పెట్టి భర్తను నిద్రలేపింది. శివయ్య బెంబేలు పడిపోతూ, అమ్మవారి గుడికి పరిగెత్తాడు. అక్కడ పక్కన నగల మూటతో యిద్దరు స్పృహలేకుండా పడివుండడం చూసి సంగతి గ్రహించాడు.

శివయ్య మూట విప్పి నగలు తీసి, వాటిని అమ్మవారికి అలంకరిస్తుండగా, అక్కడికి రమణమ్మ వచ్చింది. భార్యను చూసి శివయ్య, "ఏమే, యిప్పటికైనా అమ్మవారి మహత్యం అర్థమయిందా? నాలుగు రోజుల్లో నగలు తిరిగి యివ్వక పోతే, నువ్వు తల పగిలి చస్తావని అమ్మవారన్నది. ఆ మాటలు నేను విన్నాను. కాని, నువ్వు అదంతా, నా భ్రమ అని కొట్టి పారేశావు!" అన్నాడు.

రమణమ్మ అమ్మవారి విగ్రహం ముందు సాష్టాంగపడుతూ, "అమ్మా, నేను మూర్ఖురాలిని! నీ భక్తుడైన, నా భర్త కారణంగా, నా అపరాధం క్షమించి, నా ప్రాణాలు నిలబెట్టావు. ఈ క్షణం నుంచీ, నేనూ నీ భక్తురాలినే," అన్నది.

తరవాత, ఊరు కాపలావాళ్ళు వచ్చి, అప్పుడే స్పృహ వస్తున్న దొంగలిద్దర్నీ న్యాయాధికారి దగ్గిరకు లాక్కుపోయారు.

ఇది జరిగాక రమణమ్మ తన గయ్యాళితనం మాని, భర్త చెప్పినట్టు వింటూ, అతడితోపాటు అమ్మవారికి సేవలు చెయ్యసాగింది.





# చాణక్యుడి కథ

పూర్వం చణక అనే గ్రామంలో చణి అనే బ్రాహ్మణు డుండేవాడు. ఆయన జైన మతావలంబి. ఆయన భార్య పేరు చణేశ్వరి. వారి కొక కుమారుడు కలిగాడు. అతనే చాణక్యుడని ప్రసిద్ధి కెక్కాడు.

చాణక్యుడు అందరు పిల్లల్లాగా కాక పుట్టటమే అన్ని పళ్ళతోనూ పుట్టాడు. మునులు ఈ వింత వృత్తాంతం విని, అలా పుట్టినవాడు రాజవుతా డన్నారు. తండ్రి ఐహిక చింతకన్న పరతత్వ చింత హెచ్చుగా కలవాడు కావటం చేత, తన కొడుకుకు ఇహ భోగ్యా లంత మంచిది కాదని భావించి, అతని పళ్లు పీకించేశాడు. ఇలా జరగటం వల్ల చాణక్యుడు పరోక్షంగా రాజ్యపాలన చేస్తాడని మునులు మళ్ళీ జోస్యం చెప్పారు.

చాణక్యుడు సమస్త శాస్త్రాలూ చక్కగా చదువుకుని, పెద్దవాడై, ఒక పేద బ్రాహ్మణ కన్యను వివాహమాడాడు. ఒక సారి చాణక్యుడి భార్య, తన తమ్ముడి వివాహ సందర్భంగా, తన పుట్టింటికి వెళ్ళింది. అక్కడికి ఆమె యొక్క అప్ప చెల్లెళ్ళు వచ్చారు. వారి భర్తలు ధనికులు కావటం చేత వారు గొప్ప స్థితిలో ఉండి, ఆమె పేదరికాన్ని అవహేళన చేశారు. అవమాన పీడితురాలై ఇంటికి తిరిగి వచ్చిన భార్యను ప్రశ్నించి చాణక్యుడు జరిగిన సంగతి తెలిసి, ధనార్జనకు బయలుదేరాడు.

పాటలీపుత్రాన్ని ఏలే నందరాజు అర్హత గల బ్రాహ్మణులను ఘనంగా సత్కరిస్తా డని విని, చాణక్యుడు పాటలీపుత్రం ఆస్థానానికి వెళ్ళి, అక్కడ ఖాళీగా ఉన్న ఆసనాలలో పెద్దదిగా చూసి అందులో కూచున్నాడు. అది నందమహారాజు ఆసనం.



చేస్తానని ప్రతిజ్ఞ చేసి, పాటలీపుత్రం విడిచి వెళ్ళిపోయాడు.

మరొకరి ద్వారా రాజ్యపాలన చేసే యోగం తనకున్నదన్న సంగతి తెలుసు గనక చాణక్యుడు తన ప్రతినిధిగా రాజుగా ఉండేవాడి కోసం అన్వేషణ సాగించాడు. ఆయన సంచారం చేస్తూ మయూరపోష కులుండే గ్రామానికి వచ్చాడు. ఈ మయూరపోషకులు రాజుగారి నెమళ్లను పోషిస్తారు. గ్రామ పెద్ద యొక్క కుమార్తె గర్భవతిగా ఉండి, చంద్రుణ్ణి తాగాలన్న కోరికతో తహతహలాడుతున్నట్టు చాణక్యుడికి తెలిసింది.

''ఆమెకు పుట్టబోయే బిడ్డను నేను పెంచుకునే షరతు మీద నేనామె కోరిక తీర్చగలను,'' అని చాణక్యుడు గ్రామ పెద్దతో అన్నాడు. ఇందుకు గ్రామపెద్దా, అతని భార్యా కూడా సమ్మతించారు.

చాణక్యుడు ఒక గుడిసె కట్టించి దాని కప్పులో ఒక కంత ఏర్పాటు చేయించాడు. రాత్రివేళ చంద్రకిరణాలు పడేచోట పాల గిన్నె ఉంచి, గర్భవతిని గుడిసెలోకి తీసుకుపోయి, ''అదుగో, చంద్రుడు. దాన్ని తాగెయ్యి.'' అన్నాడు. ఆమె నిజమే నన్న భ్రమలో పాలు తాగేటప్పుడు, కప్పు పైన ఉన్న ఒక మనిషి కప్పులోని రంధ్రాన్ని క్రమంగా మూసేశాడు. తాను

కొంతసేపటికి నందరాజూ, ఆయన కొడుకూ వచ్చారు. అక్కడ ఉండే పరిచారిక చాణక్యుడికి మరొక ఆసనం చూపింది. అయినప్పటికీ చాణక్యుడు తాను కూచున్న ఆసనం నుంచి లేవక పోగా, తన జలపాత్రను ఒక ఆసనం మీదా, చేతికర్ర మరొక ఆసనం మీదా, తన తావళాన్ని ఇంకొక ఆసనం మీదా, తన యజ్ఞోపవీతాన్ని వేరొక ఆసనం మీదా ఉంచాడు.

పరిచారిక ఈ ధూర్తత్వం సహించలేక చాణక్యుణ్ణి తన్ని ఆసనం మీది నుంచి లాగి బయటికి గెంటింది. చాణక్యుడు పట్టరాని కోపంతో నందరాజ్యనిర్మూలనం



చంద్రుణ్ణి తాగేశానని గర్భవతి తృప్తి పడింది. ఈ కారణంగా ఆమెకు పుట్టిన కుర్రవాడికి చంద్రగుప్తుడు అని పేరు పెట్టారు.

ఇది జరిగినాక చాణక్యుడు ధనార్జన కోసం మళ్ళీ దేశాటన సాగించాడు. ఆయన ఆ గ్రామానికి తిరిగి రావటానికి కొంత కాలం పట్టింది. వస్తూండగా ఆయనకు కొందరు పిల్లలు కనిపించారు. వారిలో చంద్రగుప్తుడు కూడా ఉన్నాడు. అతను రాజులాగా ప్రవర్తిస్తున్నాడు. మిగిలిన వాళ్ళు అతన్ని రాజులాగే చూస్తున్నారు. చాణక్యుడు చంద్రగుప్తుణ్ణి గుర్తించలేదు, కాని అతని ఠీవి చూసి ఆశ్చర్యపడి, అతడి శక్తి పరీక్షించటానికి, తనకేమైనా దానం చెయ్యమన్నాడు.

"ఆ కనిపించే ఆవుల మందను తీసుకు పొండి. నే నిచ్చానంటే ఎవరూ అభ్యంతరం చెప్పరు," అన్నాడు చంద్రగుప్తుడు.

చాణక్యుడు సంతోషించి, ఆ కుర్రవాడే చంద్రగుప్తుడని ఇతర పిల్లల నడిగి తెలుసుకున్నాడు.

"నీవు రాజువైనప్పుడు నీకు రాజ్యం కావాలి గద! నే నిప్పిస్తాను, నా వెంట రా, నాయనా!" అని ఆయన చంద్రగుప్తుణ్ణి తన వెంట తీసుకు పోయాడు.

తాను సంపాదించిన ధనంతో చాణక్యుడు సైనిక మూక నొకదాన్ని పోగు చేసి పాటలీపుత్రాన్ని ముట్టడించాడు. బలమైన శత్రు సేనలు చాణక్యుడి సేనను అవలీలగా చిత్తుచేసి పారేశాయి. చాణక్యుడూ, చంద్రగుప్తుడూ ప్రాణాలతో పారిపోసాగారు. నందుడి సైనికులు వారిని తరుముకొచ్చారు. చాణక్యుడూ, చంద్రగుప్తుడూ ఒక సరస్సు వద్దకు చేరుకునే సరికి వారిని తరుముకొచ్చే సైనికులలో ఒకడు దగ్గిరపడ్డాడు. అప్పుడు చాణక్యుడు ఒక యుక్తి పన్నాడు. తాను తపస్విలాగా సరస్సు ఒడ్డున కూచుని, చంద్రగుప్తుణ్ణి నీటిలోకి దిగమన్నాడు.



చూసినప్పుడు నీకేమనిపించింది?'' అని అడిగాడు.

''కర్తవ్యం గురువుగారికే తెలును నను కున్నాను.'' అన్నాడు చంద్రగుప్తుడు.

దీనినిబట్టి, చంద్రగుప్తుడు రాజై తాను మంత్రి అయినప్పటికి, అతను తనకు విధేయుడై ఉండగలడని చాణక్యుడు గ్రహించాడు. ఇంతలో మరొక అశ్వికుడు వారిని తరుముతూ వచ్చాడు. చాణక్యుడు వాణ్ణి కూడా యుక్తితో చంపేశాడు. ఈసారి అయన బట్టలు ఉతికే చాకలి నొకణ్ణి, ''రాజుగారు మీ చాకలివాళ్ళ మీద అలిగి, నిన్ను పట్టుకోవటానికి సైనికుణ్ణి పంపు తున్నారు,'' అని భయపెట్టి చాకిరేవు నుంచి పంపేసి, వాడి స్థానం తాను అక్ర మించి చంద్రగుప్తుణ్ణి నీటిలోకి పంపాడు. రెండవ అశ్వికుడు చచ్చాక ఇద్దరూ పలాయనం సాగించారు.

తిండికి మాడుతూ వారిద్దరూ ఆసాయం కాలం ఒక గ్రామం చేరారు. ఎవరు తిండి పెడతారని చూస్తూ గ్రామంలో నడుస్తుం డగా ఒక ఇంట వారి కొక విషయం గోచరమయింది. ఒక బీదది, వయసు మళ్ళినది తన పిల్లల కోసం వంట చేసి, కంచాలలో వడ్డించింది. ఒక కుర్రవాడు ఆత్రంగా అన్నంలో చెయ్యి పెట్టేసరికి చెయ్యి చురుక్కుమన్నది. అది చూసి

అశ్వికుడు చాణక్యుడున్న చోటికి వచ్చి, ''ఇటుగా ఎవరన్నా పరిగెత్తుకుంటూ వచ్చారా?'' అని అడిగాడు. చాణక్యుడు నీటిలో ఉన్న చంద్రగుప్తుడికేసి చూపాడు. వెంటనే సైనికుడు గుర్రం దిగి, కన కత్తి పక్కన పెట్టి నీటిలో దిగటానికి కవచం విప్పసాగాడు. ఆ క్షణంలో చాణక్యుడు లేచి, సైనికుడి కత్తి తీసి వాడి కంఠం తెగవేశాడు.

తరవాత చాణక్యుడూ, చంద్రగుప్తుడూ ఆ సైనికుడి గుర్రం మీద ఎక్కి పలా యనం సాగించారు.

అప్పుడు చాణక్యుడు చంద్రగుప్తుణ్ణి, ''ఆ సైనికుడు నీటిలో ఉన్న నిన్ను

తల్లి, "ఏమిరా, నీవు చాణక్యుడిలాగే మందమతిలాగున్నావే!" అన్నది.

ముక్కూ మొగమూ ఎరగని ఆ పేద స్త్రీ తనని అంత మాట అన్నందుకు ఆశ్చర్యపడి చాణక్యుడు ఆ ఇంటిలో ప్రవేశించి ఆమె అలా అనటానికి కారణం అడిగాడు.

"ఒక చివర మంచి చల్లబడిన అన్నం తింటూరాక, వీడు కంచం మధ్యనే చెయ్యి పెట్టి కాల్చుకున్నాడు, నాయనా! చాణక్యుడిలాటి బుద్ధి తక్కువ పనే గదా చేశాడు? పరిసరాలు జయించుకుంటూ పోక ఏకంగా రాజధానినే ముట్టడించాడు!" అన్నది ఆ పేదరాలు.



ఇది చాణక్యుడికి మంచి గుణపాఠమయింది. ఆయన వెంటనే హిమవత్కూటానికి వెళ్ళి, ఆ రాజ్యాన్ని ఏలే పర్వతకుడనే రాజుతో ఒక ఒడంబడిక చేసుకున్నాడు. దాని ప్రకారం పర్వతకుడు నందరాజును జయించటానికి చాణక్యుడికి సహాయపడాలి; అందుకుగాను అతను నందుడు ఓడినాక ఆ రాజ్యంలో సగం పొందుతాడు.

ఈ ఒప్పందం ప్రకారం చాణక్యుడూ, పర్వతకుడూ ఏకమై పాటలీపుత్ర పరిసర ప్రాంతాలన్నిటినీ జయించసాగారు. ఒక నగరం వారికి లొంగక బలంగా నిలబడింది. దాన్ని జయించే మార్గం తోచక చాణక్యుడు ఒక త్రిదండి సన్యాసివేషం ధరించి నగరం ప్రవేశించాడు. నగరంలో సప్తమాతృకాలయం ఉన్నది. ఆ ఆలయంలో ఉండే ఏడుగురు దేవతలూ ఆ నగరాన్ని కాపాడతారని అక్కడి ప్రజల విశ్వాసం. శత్రువుల ముట్టడితో విసిగి వేసారి ఉన్న పౌరులు కొందరు సన్యాసి వేషంలో ఉన్న చాణక్యుణ్ణి చూసి, "స్వామీ, ఈ ముట్టడి ఎప్పటికి అంతమవుతుంది?" అని అడిగారు.

"నాయనలారా, సప్తమాతృకలు ఆలయాన్ని విడిచిపెడితేగాని ఈ ముట్టడి పోదు," అని చాణక్యుడు వారితో చెప్పాడు.

మూఢులైన ఆ పౌరులు ఈ మాట నమ్మి ఆలయంలో నుంచి సప్తమాతృకల విగ్రహాలను తీసేశారు. చంద్రగుప్తుడికీ, పర్వతుడికీ చాణక్యుడి సంకేతం అందింది. వారు ముట్టడి ఎత్తేసి వెళ్ళిపోతున్నట్టుగా కొంతదూరం సైన్యాలను తీసుకుపోయారు. నగరవాసులు ముట్టడి తొలగినందుకు పరమానందం చెంది, ఉత్సాహంలో మునిగి తేలుతున్న సమయంలో సేనలు ఆకస్మికంగా వచ్చిపడి నగరాన్ని వశపరుచుకున్నాయి.

చాణక్యుడు పాటలీపుత్రం పైకి వెళ్ళాడు. ఈసారి జరిగిన యుద్ధంలో నందుడు ఓడి, చాణక్యుడికి లొంగిపోయాడు. చాణక్యుడు నందుణ్ణి ప్రాణాలతో వదిలిపెడుతూ, "నీవు దేశం విడిచి వెళ్ళు. ఒక్క రథంలో తీసుకుపోగలిగినంత సంపదను నీ వెంట తీసుకుపోవచ్చు," అన్నాడు.

ఆ ప్రకారమే నందుడు రథం మీద తన ఇద్దరు భార్యలనూ, తన కుమార్తె అయిన దుర్ధరనూ ఎక్కించుకుని, అమూల్యమైన నగలూ అవీ వెంటపెట్టుకుని బయలుదేరాడు. దారిలో వారికి చంద్రగుప్తుడు రథమెక్కి వస్తూ ఎదురయాడు. చంద్రగుప్తుణ్ణి చూస్తూనే దుర్ధరకు గాఢమైన ప్రేమ పుట్టుకొచ్చింది. తన కుమార్తె మనోభావం గ్రహించి నందుడు ఆమెతో, "అమ్మా, నీవు స్వయంవరం చేసుకోగోరితే నాకేమీ అభ్యంతరం లేదు," అన్నాడు.

తండ్రి ఈ మాట అనగానే దుర్ధర తన తండ్రి రథం నుంచి దిగి చంద్రగుప్తుడి రథం ఎక్కింది. ఆమె అలా ఎక్కుతూండగా చంద్రగుప్తుడి రథ చక్రం యొక్క ఆకులు తొమ్మిది పెళపెళా విరిగాయి. ఈ శకునం చూసి చంద్రగుప్తుడు దుర్ధరను నిరాకరించబోయాడు. కాని చాణక్యుడతన్ని వారించి, "నాయనా, ఇది మంచి శకునం. నీ వంశం వారు తొమ్మిది తరాల పాటు రాజ్యమేలగలరని దీని అర్థం," అన్నాడు.—[వచ్చే సంచికలో ముగింపు]





# వానరాత్రిదొంగ

ఒకనాడు బస్రాపాలకుడైన అమీర్ దగ్గిరకు, నగరకొత్వాలు ఒక యువకుణ్ణి తీసుకువచ్చి, "ప్రభూ, వీడు ఆరితేరిన దొంగ. రాత్రి జడివాన కురుస్తున్న తరుణంలో, మన నగర శ్రీమంతుల్లో ఒకడైన దావూద్ ఖాన్ ఇంట ప్రవేశించి దొరికిపోయాడు," అని చెప్పాడు.

అమీర్, ఆ యువకుడి కేసి చీదరపడుతున్నట్టు చూసి, అంతలోనే ఆశ్చర్యపోయాడు. వాడిలో దొంగ లక్షణాలు లేకపోగా, ఎంతో హుందాతనం కనిపించింది.

"దొంగతనం చేసేందుకే, ఆ ఇంట ప్రవేశించావా?" అని అమీర్, యువకుణ్ణి ప్రశ్నించాడు.

"అవును, ప్రభూ!" అన్నాడు యువకుడు వినయంగా.

"అలాగా! అయితే, నువు చేసిన ఆ నేరానికి శిక్ష ఏమిటో తెలుసా? చేతులు రెండూ ఖండించడం," అన్నాడు అమీర్.

యువకుడు తలాడించి వూరుకున్నాడు. వాడికి తాను నిర్దోషినని వేడుకోవడం యిష్టం లేదని గ్రహించిన అమీర్, "సరే, వీణ్ణి ఖైదులో వెయ్యి. రేపు శిక్ష అమలు చేస్తాను," అన్నాడు కొత్వాలుతో.

ఆ రాత్రి అమీర్ ఖైదీలుండే కొట్లకేసి వెళ్ళాడు. అక్కడ అతడికి ఎవరో శ్రావ్యంగా పాడుతూండడం వినిపించింది. అమీర్ ఆ దిక్కుకు వెళ్ళి, ఆ పాడుతున్నది రేపు శిక్ష పొందనున్న యువకుడని తెలుసుకున్నాడు.

అమీర్ వాణ్ణి సమీపించి, "నువ్వు దొంగవు కాదన్న అనుమానం, నాకు కలిగింది. రేపు నిన్ను చేతులు నరికేందుకు వధ్యస్థానానికి తీసుకువెళ్ళినప్పుడు, అక్కడ చేరిన జనం ఎదట మరొకసారి



ప్రశ్నిస్తాను. ఆ శ్రీమంతుడి ఇంట దొంగ తనానికి కాక, మరెందుకో ప్రవేశించినట్టు చెప్పు. ఆ స్వల్పనేరానికి, నిన్ను ఒక నెల పాటు ఖైదుచేయించి విడుదల చేస్తాను,'' అన్నాడు.

''ప్రభూ, తమ దయకు చాలా కృతజ్ఞుణ్ణి!'' అన్నాడు యువకుడు ఎంతో వినయంగా.

వాడు రేపు తన సలహాప్రకారం చేయ గలడన్న నమ్మకం వజీరుకు కలిగింది. మరసటిరోజున శిక్ష అమలు జరగగలదని తెలిసి, నగరవాసులు వేలసంఖ్యలో అక్కడ చేరారు. అమీరూ, ఇతర ఉద్యో గులూ ఎత్తుగా వున్న వేదిక మీద కూర్చుని వున్నారు. భటులు యువకుణ్ణి అక్కడికి తీసుకుపోయి నిలబెట్టారు.

అప్పుడు అమీర్ పెద్దగా యువకుణ్ణి, ''నువ్వు, ఆ ఇంట ప్రవేశించింది వేరే పని మీద తప్ప, దొంగతనానికి కాదు గదా? ఆ ఇంట్లో ఎరిగివున్నవాళ్ళెవరితోనో అవసరమైన పనిపడి వెళ్ళావు, అవునా?'' అని ప్రశ్నించాడు.

''ప్రభూ, ఆ ఇంట్లో నాకే ఇతర పనీ లేదు,'' అన్నాడు యువకుడు.

ఈ జవాబు విని అమీర్ చిరాకుపడ్డాడు. శిక్ష నుంచి తప్పించుకునేందుకు, తాను ఇచ్చిన సలహా వృథా అయింది. వీడు మూర్ఖుడైవుండాలి, అనుకున్నాడాయన.

''సరే, వీడి చేతులు రెండూ నరకండి!'' అని ఆజ్ఞాపించాడు అమీర్.

భటుడొకడు కత్తి ఎత్తి వాణ్ణి సమీ పిస్తూండగా, జనంలో నుంచి ఒక యువతి వేగంగా వేదిక మీదికి పోయి, యువ కుడికీ, కత్తి ఎత్తిన భటుడికీ మధ్య నిలబడి, ''కావాలంటే నా చేతులు నర కండి. ఈ యువకుడు అబద్ధం చెపు తున్నాడు,'' అన్నది తీవ్రస్వరంతో.

అమీర్, భటుణ్ణి దూరంగా వెళ్ళమని, కన్నీళ్ళతో నిలబడిన యువతిని, ''నువ్వు వాస్తవంగా జరిగిందేమిటో చెప్పగలవా?'' అని అడిగాడు.




అప్పుడా యువతి కన్నీళ్ళు తుడుచుకుని యిలా చెప్పింది: కొన్నేళ్ళక్రితం ఆమె కుటుంబం బస్రాలోకాక మరొక నగరంలో వుండేది. అక్కడ వాళ్ళు నివసిస్తున్న ఇంటిపక్కన ఒక ధనికుడి భవనం వుండేది. ఈ యువకుడు ఆ ధనికుడి కుమారుడు. ఆమె కుటుంబానికీ, ధనికుడి కుటుంబానికీ మధ్య, మంచి స్నేహసంబంధాలున్న కారణంగా, ఆమెను, ఆ యువకుడి కిచ్చి వివాహం చేయాలన్న ఆలోచన కూడా పెద్దలలో కలిగింది.

అయితే, హఠాత్తుగా యువతి కుటుంబం బస్రాపట్టణానికి వచ్చి స్థిర పడింది. యువకుడి కుటుంబం ఏదో కారణంవల్ల, ఆర్థికంగా బాగా చితికి పోయింది. రెండు కుటుంబాల మధ్యా రాకపోకలంటూలేవు.

యువకుడు రెండు రోజులక్రితం పని మీద బస్రావచ్చాడు. రాత్రి అతడు తాను దిగిన సత్రానికి వెళుతూ, ఉరుములతో, మెరుపులతో కురుస్తున్న వానలో చిక్కుకున్నాడు. వాన తగ్గేవరకూ తల దాచుకుందామని అతడు ఒక ఇంటి మెట్లెక్కి, దాని అరుగు మీదికి వెళ్ళాడు. ఆ ఇల్లు ఒకప్పుడు తమ పొరుగున నివసించిన యువతి కుటుంబానిదని అతడికి తెలియదు.

అయితే, మెరుపులకాంతిలో కిటికీ లోంచి అతణ్ణి చూసిన యువతి, అతడెవరైనదీ గుర్తించి తలుపు తీసి లోపలికి తీసుకుపోయింది. ఆమె బాగా తడిసిపోయి వున్న అతడికి ఒళ్ళు తుడుచుకునేందుకు పొడిబట్ట యిచ్చింది. ఆ సమయంలో ఇంట్లో అందరూ నిద్రపోతున్నారు.

యువతీ, యువకుడూ ఒక గంటకాలం అదీ యిదీ మాట్లాడుకున్నారు. మాటల సందర్భంలో ఆమె, తనకు ఒక ధనిక వర్తకుడి కుమారుడితో వివాహం నిశ్చయమైపోయిందనీ, కానున్న మామగారు యిప్పుడు ఆ ఇంట్లోనే వున్నాడనీ చెప్పింది.

అప్పుడు యువకుడు నవ్వి, "ఇంత రాత్రివేళ, నేను నీ గదిలో వున్నానని తెలిస్తే, ఏం జరుగుతుంది?" అన్నాడు.

అందుకు జవాబుగా యువతి కూడా నవ్వి, "మా వాళ్ళు యీ సమయంలో నిన్ను చూడడం జరిగితే, నేను వెంటనే దొంగ, దొంగ, అని అరుస్తాను. నువ్వు కూడా, నా గౌరవం కాపాడేందుకు దొంగ నని ఒప్పుకోకతప్పదు," అన్నది.

కొద్దిసేపటికి వాన తగ్గిపోగానే యువకుడు గదిలో నుంచి బయటికి వచ్చాడు. అది చూసిన సేవకుడొకడు, "దొంగ! దొంగ!" అంటూ కేకలు పెట్టాడు.

నిద్రపోతున్న వాళ్ళందరూ లేచి పారిపోతున్న యువకుణ్ణి పట్టుకున్నారు. ఆ యువతి తల్లిదండ్రులకు అతడెవ్వరో తెలుసు. అయినా, కానున్నవియ్యంకుడు తమ కుమార్తె శీలాన్ని శంకిస్తాడని వాళ్ళు ఎరగనట్టు వూరుకున్నారు.

అంతా విన్న అమీర్ రుమాలుతో ఒకసారి కళ్ళద్దుకుని, అక్కడ చేరిన జనాన్ని ఉద్దేశించి, "ఈ యువకుడు అత్యంత ధైర్యశాలీ, నిజాయితీపరుడూ. ఒక అమాయకురాలైన యువతికి ఎలాంటి కళంకమూ రాకుండా వుండేందుకుగాను, తన రెండు చేతుల్నీ కోల్పోయేందుకు సిద్ధపడ్డాడు. త్యాగమంటే అది! నాకు కుమార్తె లేదుగాని, ఉంటే ఆమెను యితడికిచ్చి, నా అల్లుడిగా చేసుకునే వాడిని!" అన్నాడు.

ఆ మరుక్షణం యువతి తండ్రి జనంలో నుంచి వజీర్ దగ్గిరకు వచ్చి, అతడికి నమస్కరించి, "ప్రభూ, నా కుమార్తెను, యీ యువకుడికిచ్చి వివాహం చేసేందుకు అనుమతించండి. ఇతడెవరైనదీ చెప్పకుండా అందరినీ మభ్యపెట్టినందుకు సిగ్గుపడుతున్నాను," అన్నాడు.

ఆ మాటలకు అమీర్ చిరునవ్వు నవ్వాడు. జనం ఆనందంతో కరతాళ ధ్వనులు చేశారు. ఆ రోజే అమీర్ పర్యవేక్షణలో ఆ యువకుడికీ, యువతికీ వైభవంగా వివాహం జరిగింది.



# స్కాట్‌లాండ్ అడవిపిల్లి

స్కాట్‌లాండ్‌లోని ఎత్తయిన కొండలూ, నిర్మానుష్యమైన లోయలూ — అడవి జంతువులు తమ ఆహారాన్ని వేటాడుకునే అనుకూల ప్రదేశాలను కల్పిస్తున్నాయి. అందువల్ల బ్రిటిష్ దీవులలో మరెక్కడా కనిపించని అడవి పిల్లులు స్కాట్‌లాండ్ కొండ సానువులలో నివాస మేర్పరచుకున్నాయి. మనుషుల ఉపద్రవంలేని మైదానాలు, ఎత్తుపల్లాలతో నిండిన కొండలు, నదులు, సెలయేళ్లు గల ప్రదేశాలలో అడవి పిల్లులు ఉంటున్నాయి.

ఒకప్పుడు బ్రిటన్‌లో అన్ని ప్రాంతాలలో విరివిగా కనిపించే అడవి పిల్లులు, ప్రస్తుతం మానవ సంచారం ఎక్కువ కావడంతో క్రమంగా ఉత్తర ప్రాంతాలకు చేరుకున్నాయి.

మామూలు పిల్లుల కన్నా ఆకారంలో కాస్త పెద్దవిగా, పులి పిల్లల్లా ఉండే ఈ అడవి పిల్లులు ఊదా, బూడిద రంగులో ఉంటాయి. ఎత్తయిన కాళ్ళతో, శరీరమంతా దట్టమైన రోమాలతో కాస్త చదరంగా ఉన్న తలతో ఉండే ఈ జంతువులు ముప్పావు మీటరు పొడవైన తోక కలిగి ఉంటాయి. తోక చుట్టూ ఉంగరాల్లా నాలుగయిదు చారలుంటాయి.

ఇవి చెట్టు తొర్రలలోనూ, రాళ్ళ బొరియలలోనూ నివసిస్తాయి. ఆహార సంపాదనకు ఇవి చాలా చురుకుగా వేటాడుతాయి. రాత్రయినా, పగలయినా ఒంటరిగానే వేటకు బయలుదేరుతాయి. కుందేళ్ళు, ఎలుకలు, పావురాలు మొదలైన వాటికోసం ఓర్పుగా కాచుకుని కూర్చుని ఉండి, ఒక్క ఊపులో వెళ్ళి వాటిని చేజిక్కించుకుంటాయి. మామూలు ఆహారం దొరకనప్పుడు ఇవి వంజాలతో నదీ జలాలలోని చేపలను పట్టి తింటాయి. సంవత్సరానికి ఒక్కసారి, వసంత కాలంలో మాత్రమే ఈతకు వస్తాయి.

బలమైన, పదునైన గోళ్ళతో ఎప్పుడూ రౌద్రంగా కనిపించే ఈ అడవి పిల్లులను మచ్చిక చేసి పెంపుడు జంతువులుగా పెంచడం సాధ్యం కాని పని. ఇవి చిన్న పిల్లలుగా ఉన్నప్పుడు పట్టి, బోనుల్లో బంధించి, ఆహారం అందించినా, ఆహారాన్నందించే చేతులను రక్కుతాయి.



ఒకప్పుడు వీటిని మనుషులు వేటాడి చంపేవారు. ఇవాళ వీటి సంతతి నశించిపోయే స్థితికి వచ్చింది. అందువల్ల వీటి జోలికి పోవడంలేదు. పైగా అడవి పిల్లులు—చెట్లను నాశనం చేసే ఉడతలు వంటి జంతువుల సంఖ్యాభివృద్ధిని అదుపులో పెడుతున్నవి।



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1986 మార్చి నెల సంచికలో ప్రకటింపబడును.



Mrs. V. Rajamani



Pıanlal K. Patel

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జనవరి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: సంబరాల గుర్రం

రెండవ ఫోటో: అంబరాని కెళ్ళదు

పంపినవారు: యం. డి. షఫీవుల్లా, ఏలూరు–534001 (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.

### మీకు తెలుసా? సమాధానాలు

1. మలగాసీ (మడగాస్కర్); 2. సిసిలీ; 3. ట్రిస్టాన్ డా కున్హా; 4. మూడు వందలకు పైగా; 5.7,107 ద్వీపాలు.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

## పుప్పిపళ్లను ఎదుర్కోడానికి ఒక సూపర్ ఫైటర్ వుంటేనే సాధ్యం.






















ఫోర్‌హాన్స్ ఫ్లోరైడ్ ప్రసిద్ధ ఫోర్‌హాన్స్ రక్షణ అందిస్తుంది.




ఫోర్‌హాన్స్ ఫ్లోరైడ్ చిగుళ్లను బిగిస్తుంది. పుప్పిపళ్లను ఎదుర్కొంటుంది.

404 GM-183 TEL

"ముఖంపై మొట్టమొదటి మొటిమ వచ్చిందని కనుక్కున్న రోజు.
అదే నేను క్లియరసిల్‌ని కనుక్కున్న రోజు"



నాకింకా బాగా గుర్తుంది ఆ రోజు. నేను ఉత్సాహంతో గంతులువేస్తున్న రోజు....అక్కయ్య పెళ్ళి యింకా సరిగ్గా వారం రోజులుందేమో. కొత్త బట్టలు ముచ్చటగా వేసుకుంటూ అద్దం ముందు నిలబడ్డా—చటుక్కున గాబరాపడ్డా....నా బుగ్గ మీద ఏదో వచ్చిందని చూసుకుని....మొటిమ. నా ముఖంపై వచ్చిన మొట్టమొదటి మొటిమ. నేననుకున్నా చటుక్కున....నా కేమిటి. యిదేమిటి. యిప్పుడే రావాలేమిటి అని!

అప్పుడే వచ్చింది అక్కయ్య అక్కడికి. చూసింది నా వాలకం—"పిచ్చి పిల్లా. యీ మాత్రం తెలియదా. యీ వయసులో అందరికీ వస్తాయి గదా మొటిమలు. నాకూ వచ్చాయి. వాడేను నేనప్పుడు క్లియరసిల్. వాడాలి నువ్వు మరి. ఏం?" వాడేను నేనూ మరందుకే. ఏమైందో తెలుసా? పనిచేసిందది!....ఇక ఆ ఉషారులో పెళ్ళి పందిట్లో ఎంత చలాకీగా తిరిగానో ఏం చెప్పమంటారు.

**క్లియరసిల్, మొటిమల్ని పోగొడుతుంది, దాంతో బాటే వాటిని పాకకుండా చేస్తుంది.**






OBM/5687/TL

# క్లియరసిల్

**మొటిమల్ని పోగొట్టేందుకు ప్రత్యేకమైన చికిత్స-ఎక్కువ ప్రభావంతో పనిచేసేది.**

CHANDAMAMA (Telugu) JANUARY 1986 Regd. No. M. 4854



కామిక్స్ అన్నవి ఇక బోరే బోరే
రవి అనుకున్నాడు చెయ్యాలనేదో వేరేవేరే
తనంతట తానే సరదా తీరేలా
ఇతరులు చూసి మురిసిపోయేలా
ఆ! ఈ ఎకో పెన్సిలుసెట్ నాకు జోడీ
గీసేస్తా నేనింక కూసే ఓ కోడీ
అల్లరి పిల్లల బడీ, రెండు జడల జోడీ.
నాన్న పెంచే మీసం, అమ్మ చేసే పకోడీ.
ఎకో పచ్చ ఎకోనీలం
ఎరుపు పసుపు నారింజ రంగుల మయం
ఊదా, నలుపు, వైలెట్
గులాబీ, గోధుమలతో అయ్యేనది ఓ సెట్

# ఎకో
స్కెచ్ పెన్ రంగుతే ఇక రంగులు- సరదాతీర్చే హంగులు!

